
మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం
SUPER
RIN
STRIKES WHITER
సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు

| | | |
|---|---|---|
| NAME ________ | NAME ________ | NAME ________ |
| CLASS ____ DIV. ____ | CLASS ____ DIV. ____ | CLASS ____ DIV. ____ |
| SUBJECT ________ | SUBJECT ________ | SUBJECT ________ |
| SCHOOL ________ | SCHOOL ________ | SCHOOL ________ |
| PARLE Melody Chocolate Toffs  | PARLE POPPINS  | PARLE Gluco  |
| NAME ________ | NAME ________ | NAME ________ |
| CLASS ____ DIV. ____ | CLASS ____ DIV. ____ | CLASS ____ DIV. ____ |
| SUBJECT ________ | SUBJECT ________ | SUBJECT ________ |
| SCHOOL ________ | SCHOOL ________ | SCHOOL ________ |
| PARLE Gluco  | PARLE POPPINS  | PARLE Melody Chocolate Toffs  |

స్కూలు
పుస్తకాంపై
అతికించండి
పార్లే.
టిఫిన్
డబ్బాలలో
నింపండి
పార్లే.

PARLE
Melody
Chocolate Toffs






PARLE Gluco




everest/85/PP/334



"రీగల్ ఉంటే
కలత లేదిక!"



"సూపర్ కాంతులు వెదజల్ల
నేను సూపర్ పవర్ రీగల్‌నే
విశ్వసిస్తాను"

సూపర్ పొంగి
పొరలే నురుగు
సూపర్
ప్రకాశవంతమగు
ఉతుకు!

"ఎందుకంటే సూపర్ పవర్ రీగల్ పొంగి పొరలే నురుగు; బట్టలను గట్టిగా అంటిపెట్టుకొని ఉన్న మురికినికూడా నిర్మూలించి ప్రకాశవంతముగా ఉతక గలదు."

సూపర్ పవర్
**రీగల్**
డిటర్జెంట్ సబ్బు




తయారీదార్లు
షా వాలెస్
Shaw Wallace
మాత్రమే!

ACIL/0955/86 Tel

## నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్లు యింక దృఢంగా, ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే, వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యింక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి.
నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.
వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

84-55 Tel

# చందమామ


సంస్థాపకుడు : 'చ క్ర పా ణి'

సంచాలకుడు : నా గి రె డ్డి


ఈ నెల బేతాళకథ [''ఈర్ష్యకు ఫలితం'']కు ఆధారం, లక్ష్మీగాయత్రి రచన. మనిషి సంఘజీవి. ఆ కారణం వల్ల, అతడి జీవన విధానాన్ని, అతడి ప్రవర్తనతోపాటు తోటివాళ్ళ ప్రవర్తన కూడా తీర్చి దిద్దుతుంది. ''మల్లప్ప ఉపాయం'' అన్న కథలో, ఈ వాస్తవం చక్కగా నిరూపించబడింది.

## అమరవాణి

ధనాని జీవితం చైవ, పరార్థే ప్రాజ్ఞ ఉత్సృజేత్,
సన్నిమిత్తే వరం త్యాగో, వినాశే నియతే సతి.

[జ్ఞాని అయిన వాడు—పరోపకారం కోసం, తన సంపదనైనా, ప్రాణాన్నయినా త్యాగం చేయడానికి వెనుకాడడు. ఎందుచేతనంటే, అవి ఎప్పటికైనా నశించేవే అన్న సత్యం అతనికి తెలుసు.]


సంపుటి 78 జూన్ '86 సంచిక 6

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00







మీకు అందిస్తున్నాం!

# క్లియరసిల్ మెరుపు

## కొత్త క్లియరసిల్ సబ్బు
## ఎక్కువగా చేరిన నూనెల్ని తీసేసి, మీకిస్తుంది
## తేటైన, మెరుపుగల ముఖ వర్చస్సు

కొత్త క్లియరసిల్ సబ్బు. మీరు ఇప్పటిదాకా ఇటువంటి దానితో స్నానం చెయ్యలేదు మరి. ఎందుకంటారా? ఇది మిగతా వాటిలాగ కాదు— ఈ కొత్త క్లియరసిల్ సబ్బులో గల హాయినిచ్చే పుష్కలమైన నురగ, తీయటి సుగంధం, ఒంటిపైన దీని అనుభవం ఎలాగూ బాగుంటుంది— అంతేకాకుండా ఇది మీ చర్మానికి ఒంటికంతటికీ ఎంతో మేలు చేస్తుందిక.

అదెందుకంటే, దీనిలోగల ప్రత్యేకమైన పదార్థాలూ, పుష్కలమై, సమృద్ధి అయిన నురగ, మీ చర్మంలోని సూక్ష్మ రంధ్రాలను పూర్తిగా ఆ ఎక్కువగా చేరిన నూనెని సున్నితమైన తీరులో కరిగిపోయేస్తుంది గనక. దాంతో ఇక మీ చర్మం మరింత శుభ్రంగా, మరింత తేటగా, అది కూడా మునుపెన్నడూ లేనంతగా రూపొందుతుంది. అదే మరి క్లియరసిల్ మెరుపు అంటే!




కొత్త క్లియరసిల్ సబ్బు—చర్మంలోని జిడ్డు పోగొట్టేందుకు

OBM/5428/TEL

## చందమామ కబుర్లు

### ఫ్లోరిడాలో తాజమహల్



దొనాల్డ్ సోర్ధిని అనే అమెరికా దేశస్థుడు — ఫ్లోరిడాలో. తాజమహల్ వంటి కళాభవనాన్ని నిర్మించడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రస్తుతం యేటా ఏ కొంధరు అమెరికా పౌరులకు మాత్రమే మన దేశంలోని తాజమహల్‌ను సందర్శించడానికి వీలవుతున్నది. అదే ఫ్లోరిడాలో ఉన్నట్టయితే లక్షలాది మంది చూడడానికి అందుబాటులో ఉంటుందనీ, అందుకే అధిక వ్యయంతో, ఈ భవన నిర్మాణానికి పూనుకున్నట్టు అయన చెబుతున్నాడు।

### పిరమిడ్లయుగం నాటి వాయువు



దాదాపు 4,600 సంవత్సరాల నాడు నిర్మించబడిన చియోప్స్ పిరమిడ్, అడుగు భాగాలలో నిలువఉన్న వాయువును సీసాలలోకి నింపి, దానిని పరిశోధించడానికి కొందరు విజ్ఞాన వేత్తలు పూనుకున్నారు. దీని ద్వారా భూమి అంతర్భాగంలోని వాతావరణాన్ని తెలుసుకోవడంతో పాటు, ప్రాచీన ఈజిప్టు దేశస్థులు — విలువైన వస్తువులను యేళ్ళ తరబడి ఎలా భద్రపరచేవారో గ్రహించవచ్చని భావిస్తున్నారు.



### స్త్రీలు మాత్రమే!

సౌదీ అరేబియాలో స్త్రీలు మాత్రమే పనిచేసే ఒక కర్మాగారాన్ని నెలకొల్పుతున్నారు. ఆ దేశంలో స్త్రీ పురుషులు కలిసి ఒకే చోట పనిచేయకూడదన్న నిషేధం దృష్ట్యా ఈ ఏర్పాటు చేస్తున్నారు।

## మీకు తెలుసా?

1. ప్రపంచంలో కెల్లా అతిప్రాచీనమైన రాజధానీ నగరం ఏదో మీకు తెలుసా?
2. మాస్కోకు పూర్వం రష్యా రాజధాని ఏది?
3. నార్వే రాజధాని ఓస్లో వెనకటి పేరేమిటో మీకు తెలుసా?
4. కాన్‌బెర్రాకు పూర్వం, ఆస్ట్రేలియా రాజధాని ఏది?
5. ఈజిప్టు రాజధాని అయిన కెయిరో నగరం మరొక పేరేమిటో మీకు తెలుసా?

(సమాధానాలు 65వ పేజీలో)

పురాణగాథలు :

# కార్తవీర్యార్జునుడు

నర్మదానదీ తీరంలోని మాహిష్మతీ నగరం రాజధానిగా కార్తవీర్యార్జును డనే రాజు రాజ్యపాలన జరిపేవాడు. అతనికి ఏ పనినైనాసరే, తనే స్వయంగా తన చేతులతో చేసుకునే శక్తి కావాలన్న కోరిక కలిగింది. అందుకోసం అతడు దత్తాత్రేయుణ్ణి భక్తితో సేవించి, వేయి చేతులను వరంగా పొందాడు।

వేయి చేతులు పొందాక, కార్తవీర్యునిలో క్రమంగా అహంకారం చోటు చేసుకోసాగింది. ఒకనాడు నదిలో స్నానం చేస్తూండగా అతనికి, నదీ ప్రవాహాన్ని తన చేతులతో ఆపాలన్న ఉత్సాహం కలిగి, వేయి చేతులను నదికి అడ్డంగా పెట్టాడు. దాని కారణంగా నదీ ప్రవాహం పొంగి, నదీ తీరంలో బసచేసి ఉన్న రావణుడి సేనలను ముంచింది. దానిని చూసి ఆగ్రహం చెందిన రావణుడు కార్తవీర్యునితో యుద్ధానికి తలపడి ఓడిపోయాడు. ఈ సంఘటన కార్తవీర్యునిలో మరింత అహంభావాన్ని పెంచింది.

ఒకసారి అగ్నిదేవుడి కోరిక మేరకు, గిరినగరారణ్యాన్ని దహించడానికి, కార్తవీర్యుడు అతనికి అనుమతి ఇచ్చాడు. ఆ మంటలలో అపవు డనే ముని ఆశ్రమం తగులబడి పోయింది. దానిని చూసి కోపావేశం చెందిన అపవుడు "వేయి చేతులు కలవన్న అహంభావంతో మిట్టిపడుతున్న నువు, త్వరలో వాటిని కోల్పోదువుగాక!" అని కార్తవీర్యుణ్ణి శపించాడు.

కొన్నాళ్ళకు కార్తవీర్యుడు జమదగ్ని ఆశ్రమంలోని కామధేనువును అపహరించడానికి ప్రయత్నించి విఫలుడై, జమదగ్ని మహర్షిని చంపాడు. ఆ తరవాత ఆశ్రమానికి వచ్చి, విషయాన్ని గ్రహించిన జమదగ్ని కుమారుడైన పరశురాముడు, ఆ దుర్మార్గాన్ని సహించలేక, ఆగ్రహావేశంతో కార్తవీర్యుడి వేయి చేతులూ ఖండించి, అతణ్ణి హతమార్చాడు.





# విశారదుడి సంస్కృత భాష

చండికాపురంలోని జగన్నాథుడనే బ్రాహ్మణుడికి, ముగ్గురాడపిల్లల తర్వాత జన్మించాడు, విశారదుడు. లేక లేక మగ పిల్లవాడు పుట్టిన కారణాన తల్లిదండ్రులూ, అక్కలూ కూడా వాణ్ణి చిన్న తనం నుంచీ ఎంతో గారాబంగా పెంచారు. అందువల్ల వాడికి తిన్నగా చదువురాలేదు. విశారదుడికి పదిహేనేళ్ళ వయసు వచ్చే సరికి, వాడి ముగ్గురక్కలకూ పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళకు వెళ్ళిపోయారు. వాడి తలిదండ్రులు వృద్ధాప్యంలోకి వచ్చారు. విశారదుడి భవిష్యత్తు గురించి వాళ్ళకు బెంగగా వుండేది. ఎందువల్లనంటే వాడికి చదువంటే ఆసక్తి లేదు; భవిష్యత్తును గురించిన భయం లేదు.

ఇలా వుండగా, ఒకరోజున బైరాగి ఒకడు, జగన్నాథుడి ఇంటి ముందు నిలబడి, "నాకు భిక్ష పెట్టండి. మీ సమస్యలు పరిష్కరించుకోండి," అని కేకపెట్టాడు.

ఇది విని జగన్నాథుడు లోపలినుంచి పరుగునవచ్చి, బైరాగిని చూసి, "అయ్యా, తమ ముఖంలో తేజస్సు కనబడుతున్నది. మా ఇంట భిక్ష స్వీకరించండి!" అన్నాడు.

ఆ పూట బైరాగి, జగన్నాథుడి ఇంట్లో తృప్తిగా భోజనంచేసి, "నన్ను సంతోష పెట్టావు. నీ సమస్య చెప్పు పరిష్కరిస్తాను," అన్నాడు.

జగన్నాథుడు, బైరాగికి విశారదుడి గురించి చెప్పి, "మేమెంతకాలం బతికేదీ తెలియదు. మేము లేకుండా, వీడెలా బతుకుతాడా అన్నదే, మా బెంగ!" అన్నాడు.

బైరాగి, విశారదుణ్ణి చూడగోరాడు. జగన్నాథుడు భార్యను పంపి, పొరుగింట్లో ఆడుకుంటున్న విశారదుణ్ణి రప్పించాడు.

"వసుంధర"



సంస్కృతం నేర్పించు. ఆ భాషవల్లనే అతడు పైకి వస్తాడు. అతడి కారణంగా, ఆ భాషకూడా మంచి ప్రచారం లభిస్తుంది,'' అన్నాడు బైరాగి.

''మామూలు చదువే రావడంలేదు. వీడికి సంస్కృతం ఎలా వంటబడుతుంది!'' అన్నాడు జగన్నాథుడు దిగులుగా.

వెంటనే విశారదుడు, ''నాన్నా, నువ్వు దిగులుపడకు. రాజాశ్రయం కోసం నేను కష్టపడి సంస్కృతం నేర్చుకుంటాను,'' అన్నాడు.

''చూశావా? నీకొడుక్కు అప్పుడే సంస్కృతం పట్ల వ్యామోహం కలిగింది. నా మాట నమ్ము,'' అని చెప్పి బైరాగి వెళ్ళిపోయాడు.

జగన్నాథుడికి సంస్కృత భాషలో కొంత ప్రవేశమున్నది. ఆయన, ఆ రోజు నుంచే కొడుక్కు ఆ భాష నేర్పాలని ప్రయత్నించాడు. అయితే, ఎన్ని రోజులు గడిచినా విశారదుడికి ఒక్క అక్షరం కూడా సరిగా రాలేదు.

''వీడికి సంస్కృతం రావడం లేదు. ఆ భాష రానిదే, వీడికి భవిష్యత్తు లేదని బైరాగి చెప్పాడు. ఏం చేయాలో నాకు పాలుపోవడం లేదు,'' అన్నాడు జగన్నాథుడు బాధగా భార్యతో.

బైరాగి, విశారదుణ్ణి దగ్గిరగా రమ్మని, వాడి కుడిచేతిలోని రేఖలను శ్రద్ధగా పరీక్షించి, జగన్నాథుడితో, ''మీ కొడుకు గురించి బెంగవద్దు. విశారదుడికి రాజాశ్రయం లభిస్తుంది. వీడి వైభవాన్ని కళ్ళారా చూసేంతవరకూ, మీరు జీవించి వుంటారు,'' అని చెప్పాడు.

''వీడికి ఏ విద్యపైనా ఆసక్తి లేదు. ఎందులోనూ ప్రావీణ్యం వచ్చే సూచన లేదు. ఇలాంటివాడికి, రాజాశ్రయం ఎలా లభిస్తుంది?'' అన్నాడు జగన్నాథుడు అనుమానంగా.

''నీవు చెప్పింది నిజమే! దేనికైనా మానవ ప్రయత్నం కావాలి. విశారదుడికి

''మీరు, మామూలు విషయాలే, నాకర్థమయ్యేలా చెప్పలేరు. అలాంటిది, మన విశారదుడికి సంస్కృతం ఏం నేర్ప గలరు ? విద్యాభ్యాసానికి మంచి గురువు అవసరం,'' అన్నది జగన్నాథుడి భార్య.



భార్య మాటల్లో నిజమున్నదని, జగన్నాథుడికి తోచింది. అయితే ఆ ఊళ్ళో సంస్కృతం నేర్పే గురువులేడు. పొరుగూళ్లో మాతాచరణుడనే సంస్కృత పండితుడున్నాడు. ఆయన జంతువులకు కూడా సంస్కృతం నేర్పగలడని పేరు. జగన్నాథుడు, విశారదుణ్ణి తీసుకుపోయి, ఆయనకు అప్పగించాడు.

మాతాచరణుడు జగన్నాథుడితో, ''భాషను నేర్పడం ఒక ప్రత్యేక కళ. అందునా సంస్కృత భాష బహు కఠినమైనది. రెండు సంవత్సరాలలో, నీ కొడుకును, నా అంతటివాణ్ణి చేస్తాను. వాడికి భాషలోని మెలుకువలన్నీ కరతలామలకం చేస్తాను,'' అన్నాడు.

''అయ్యా, మా వాడికి నిజంగా సంస్కృత భాష అబ్బుతుందంటారా ? వాడి భవిష్యత్తంతా, ఆ భాష నేర్చుకోవడం మీదనే ఆధారపడి వున్నది,'' అన్నాడు జగన్నాథుడు.

''నువ్వేమీ నిరాశపడకు. నా వద్దకు వచ్చి, భాష నేర్చుకోలేకపోయినవాడెవడైనా వుంటే నేను చదువు చెప్పడం మానేస్తానని ప్రతిజ్ఞ పట్టాను. ఇరవై ఏళ్ళుగా విద్యాబోధన చేస్తున్నా, నా వద్ద భాష నేర్చుకోలేని శిష్యుడు లభించ లేదు,'' అన్నాడు మాతాచరణుడు.

జగన్నాథుడు తృప్తిపడి వెళ్లిపోయాడు. మాతాచరణుడు విద్యాబోధన ప్రారంభించి, విశారదుడికి సంస్కృతం నేర్పడం, తనవల్ల కాదని గ్రహించాడు. ఆ విషయం ఒప్పుకుంటే, తన వృత్తికే భంగం కలుగుతుంది!

అందువల్ల, ఆయన రెండేళ్ళపాటు వాడికి ఓపికగా చదువు చెప్పి, ''నీ విద్యాభ్యాసం పూర్తయింది. ఇప్పుడు సంస్కృత

“ఇక మీదట ఎవరైనా, నీకు సంస్కృతం నేర్పిన గురువెవ్వరని అడిగితే, పొరపాటున కూడా, నా పేరు చెప్పకూడదు. అదే నువ్వు నాకివ్వగల గురుదక్షిణ!” అన్నాడు మాతాచరణుడు.

విశారదుడు అందుకంగీకరించి, ఇంటికి తిరిగివెళ్ళి, తండ్రితో తనకు సంస్కృత భాష పూర్తిగా వచ్చినదని చెప్పాడు. జగన్నాథుడు కొడుకు పాండిత్యాన్ని పరీక్షించాలనుకున్నాడు.

అప్పుడు విశారదుడు తండ్రితో, “నాన్నా, నేను మహా పండితులతో తప్ప సంస్కృతం మాట్లాడకూడదని, గురువాజ్ఞ. అందువల్ల, నీతో మాట్లాడను. నువ్వు మంచి ముహూర్తం సూచిస్తే, జైత్ర యాత్రకు బయల్దేరాలనుకుంటున్నాను. దేశంలోని సంస్కృత పండితులందర్నీ, ఓడించాలన్నది, నా సంకల్పం!” అన్నాడు.

జగన్నాథుడు ఇందుకెంతో సంతోషించి, “ఒకవేళ బైరాగి మాటలు నిజం కానున్నవేమో! నువ్వు తప్పక జైత్ర యాత్రకు బయల్దేరు,” అని ఒక మంచి ముహూర్తం చూసి, కొడుకును ఆశీర్వదించాడు.

రాజధానికి వెళ్ళే దారిలో, విశారదుడు స్వర్ణపురం చేరి, అక్కడ ఒక సజ్జనుడి



భాష నీ అంతగా తెలిసినవాడు లేడు. అయితే, నువ్వు మహా పండితులతో తప్ప, ఆ భాష మాట్లాడవద్దు. సంస్కృతం దేవ భాష; సామాన్యులతో మాట్లాడ తగింది కాదు,” అన్నాడు.

విశారదుడు సంతోషంగా మాతాచరణుడికి నమస్కరించి, “గురువర్యా, మీ మేలు మరవలేను. నా భవిష్యత్తుకొక చక్కని మార్గం చూపించారు. నేను నేర్చుకున్న విద్యతో రాజాశ్రయం సంపాదించుకున్నాక, మీకు, నా తండ్రి ఇచ్చిన కానుకలు కాక, వేరే గురుదక్షిణ కూడా ఇచ్చుకుంటాను. తమకేం కావాలో చెప్పండి,” అని అడిగాడు.

ఇంట బసచేశాడు. ఆయన భార్య పరమ గయ్యాళి. దారేపోయేవాళ్ళను ఇంటికి తీసుకువస్తున్నాడని, ఆమె భర్త మీద కయ్యానికి దిగింది.

విశారదుడు ఆమెతో ఎంతో శాంతంగా, "అమ్మా, నేనొక మహా సంస్కృత పండితుణ్ణి. నా రాకతో, మీ ఇల్లు పావనమయింది. అందుకు సంతోషించు," అని చెప్పాడు.

ఇది విని గయ్యాళి మరింతగా మండిపడి, "సంస్కృతంలో పాండిత్యానికేం! నేనూ మహా పండితురాలనే," అన్నది.

ఆ జవాబు విని విశారదుడు చాలా సంతోషించి, "అయితే ఇంకేం! మనిద్దరం సంస్కృతంలో మాట్లాడుకోవచ్చు," అని సంస్కృత భాషలో మాట్లాడ సాగాడు.

ఆ భాష విని గయ్యాళి చెప్పలేనంతగా భయపడి పోయింది. అటువంటి భాష అంతవరకూ ఆమె ఎక్కడా విని వుండలేదు. విశారదుడు మహా మాంత్రికుడై వుంటాడని ఆమె భావించి, "అయ్యా, నన్ను శపించవద్దు. నాకు బుద్ధి గరపడానికి, నిన్ను నా భర్త తీసుకువచ్చి వుంటాడు. ఇక మీదట, ఎప్పుడు గాని, నా భర్త మాటల కెదురాడను. నీ శాపాన్నుపసంహరించు!" అన్నది.

తనపాండిత్యప్రభావం, ఆమెలో మార్పు తెచ్చిందని విశారదుడనుకున్నాడు. తన భార్య గయ్యాళితనాన్ని పోగొట్టినందుకు





సజ్జనుడు వాడికి నూరు వరహాలు బహూకరించి, "మా స్వర్ణపురిలో, కవితానందుడనే సంస్కృత పండితుడున్నాడు. తనను ఓడించినవారికి వెయ్యి వరహాలు బహుమానం కూడా యిస్తాడాయన. నువ్వాయన్ని కలుసుకోరాదా!" అన్నాడు.

మర్నాడే విశారదుడు, కవితానందుణ్ణి కలుసుకుని, తన జైత్ర యాత్ర గురించి చెప్పి, సంస్కృతం మాట్లాడసాగాడు. ఆ భాష కవితానందుడికి బొత్తిగా అర్థం కాలేదు. ఆయన మిడిమిడి జ్ఞానంతో పండితుడనని గొప్పలు చెప్పుకుంటూ, మ్రానులేని చోట ఆముద వృక్షంలా వెలుగుతున్నాడు.

అతడికి విశారదుడి మాటలు వింటూనే, అతడు మహా పండితుడై వుంటాడని భయం కలిగి, "అయ్యా, పోటీలో ఓడిపోతే, స్వర్ణపురిలో నా గౌరవం తగ్గిపోతుంది. నీకు, నేను వెయ్యి వరహాలూ ఇచ్చుకుంటాను. మన మధ్య పోటీ వద్దు. మనదేశపు రాజు వరాహసేనుడు గొప్ప సంస్కృత పండితుడు. ఆయన ముందు నీ పాండిత్యం ప్రదర్శించి, రాజాశ్రయం సంపాదించుకో," అని చెప్పాడు.

విశారదుడు సరేనని, కవితానందుడి వద్ద వెయ్యి వరహాలు తీసుకుని, సరాసరి రాజధానికి బయల్దేరాడు. వాడు రాజధాని చేరుకునేసరికి వారం రోజులు పట్టింది. అక్కడ విచారించగా, రాజాస్థానంలో చతురపాదు డనే సంస్కృత పండితుడున్నాడనీ, ముందుగా ఆయన్ని కలుసుకుంటే తప్ప, రాజదర్శనం లభించదనీ తెలిసింది. విశారదుడు, చతురపాదుణ్ణి కలుసుకుని, తన పాండిత్యం ప్రదర్శించాడు!

చతురపాదుడు, విశారదుణ్ణి మందలించి, "నాయనా, ఎంతో మధురమైన సంస్కృత భాష, నీ నోట భయంకరంగా వినవస్తున్నది. ఉచ్చారణలో, వ్యాకరణంలో, భాషలో—ఎన్నో దోషాలున్నవి.

మనదేశపు రాజు వరాహసేనుడు, నీ భాష విన్నాడంటే, నీ నాలుక కోయిస్తాడు. నా మాట విని తిరిగి నీ గ్రామానికి వెళ్ళి, కాయకష్టంచేసి జీవించు. దారి ఖర్చులకు డబ్బు కావాలంటే, నేనిస్తాను,'' అని నూరు వరహాలిచ్చాడు.

విశారదుడికి, చతురపాదుడి మాటలపై ఏమాత్రం విశ్వాసం కలగ లేదు. వాడు కోపంగా, ''నువ్వు, నా పాండిత్యం చూసి అసూయపడుతున్నావు. నాకు రాజదర్శనమైతే, ఆ మరుక్షణమే నీ పదవికి చేటు కలుగుతుందని భయపడు తున్నావు,'' అంటూ చతురపాదుణ్ణి నిందించాడు.

చతురపాదుడు ఎంతో శాంతంగా, ''నీ మేలు కోరి హితవాక్యాలు చెప్పాను. అందుకు బదులు నన్నే నిందిస్తున్నావు. మహారాజు కొన్ని రోజులుగా అస్వస్థుడుగా వుంటున్నాడు. నీకు రాజదర్శనం కలిగిస్తాను. ఆపైన ఏం జరిగినా, అది నీ కర్మ!'' అన్నాడు.

''రాజదర్శనం కలిగితే, నాకు తప్పక రాజాశ్రయం లభిస్తుంది. అప్పుడు, నీ రుణం తీర్చుకుంటాను,'' అన్నాడు విశారదుడు.

''నా కారణంగా, నీకు రాజదర్శనం కలిగిందని రాజుకు తెలియనివ్వకు.



దానితో నీ రుణం తీరిపోతుంది!'' అన్నాడు చతురపాదుడు.

ఆ రోజే విశారదుడికి రాజ దర్శనం లభ్యమైంది. ''ఎవరు నువ్వు? ఏమి కోరి వచ్చావు?'' అని అడిగాడు వరాహ సేనుడు.

''నా పేరు విశారదుడు. సంస్కృతంలో మహా పండితుణ్ణి. నా పాండిత్యం ప్రదర్శించి, రాజాశ్రయం సంపాయించాలని వచ్చాను,'' అన్నాడు విశారదుడు.

ఆ సమయంలో రాజు దిగులుగానూ, అలసట చెందినవాడు గానూ వున్నాడు. ఆయన, విశారదుణ్ణి, ''చూస్తే పసి వాడిలా వున్నావు. నీకు అప్పుడే అంత

సంస్కృత పాండిత్యం ఎలా కలిగింది?'' అని అడిగాడు.

''ఒక గురువు నన్ను రెండే రెండు సంవత్సరాలలో, ఆరితేరిన పండితుణ్ణి చేశాడు,'' అంటూ విశారదుడు, రాజుతో సంస్కృతం మాట్లాడసాగాడు.

విశారదుడి భాష వింటూనే వరాహ సేనుడికి పొట్టచెక్కలయ్యేలా నవ్వు వచ్చింది. ఆయన అతికష్టం మీద నవ్వాపు కుని, ''ఇంతకూ నీకు విద్య నేర్పిన గురువు పేరేమిటో చెప్పు?'' అన్నాడు.

''ఆయన పేరు రహస్యంగా వుంచ డమే, నేను తనకిచ్చే గురుదక్షిణ అవుతుందని, నా గురువు చెప్పాడు,'' అన్నాడు విశారదుడు.

రాజు, ఈ మాటలకు మరొకసారి నవ్వుకుని, విశారదుణ్ణి అడిగి, అతడి కథంతా తెలుసుకుని, ఆ రాత్రికి తన గదిలోనే పడుకోమన్నాడు.

మర్నాడు రాజవైద్యుడు వచ్చి, రాజును పరీక్షించి, ''ప్రభూ, ఒక్క రాత్రిలో మీలో చాలా మార్పు వచ్చింది! మందు లన్నీ చక్కగా పని చేస్తున్నవి,'' అన్నాడు సంతోషంగా.

''మనసు బాగున్నప్పుడే, మనిషికి మందులు పని చేస్తాయి. ఎన్నో సమస్య లతో ఉక్కిరిబిక్కిరవుతున్న నాకు, ఈ విశారదుడి సంస్కృత భాష కలిగించిన వినోదం అంతా, యింతా కాదు. దానితో నా సమస్యలన్నీ మరచిపోయాను,'' అన్నాడు వరాహసేనుడు.

ఆ తర్వాత విశారదుడికి రాజాశ్రయం లభించింది. తన సంస్కృత భాషతో పదిమందికీ వినోదం కలిగించడం వాడి దినచర్య.

ఇలా రాజాస్థానంలో స్థిరపడ్డాక, విశా రదుడు తల్లిదండ్రులను తన వద్దకు పిలిపించుకున్నాడు. తండ్రి జగన్నాథుడు కొడుకు వైభవానికి ఎంతో సంతోషిస్తూ, ''ఏ విధంగానైతేనేం, విశారదుడు బైరాగి మాటలు నిజం చేశాడు!'' అను కున్నాడు.






## 2

[ధవళగిరి రాజకుమారుడైన చిత్రసేనుడు, వేటకు వెళ్ళి, కొండ గుహలో సిద్ధుణ్ణి చూశాడు. సిద్ధుడు అతడికి ఒక వెదురుబుట్ట ఇచ్చాడు. అతడు ఆ బుట్ట మూత తీయగానే, ఒక భవనం కనిపించింది. ఉగ్రాక్షు డనే రాక్షసుడు అక్కడికి వచ్చాడు. చిత్రసేనుడు, తనకు మొదటగా పుట్టబోయే కొడుకును, ఆ రాక్షసుడిపరం చేయటానికి ఒప్పుకున్నాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు అడవిచెట్ల చాటున కనిపించకుండా పోగానే, చిత్రసేనుడు బతుకు జీవుడా అనుకుంటూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. ఏదో విధంగా తను ప్రాణాపాయం నుంచి బయటపడ్డాడు. ఇక తను ఈ కీకారణ్య ప్రాంతం వదిలి, ఏదో విధంగా ధవళగిరి నగరం చేరాలి.

చిత్రసేనుడు ఇలా ఆలోచిస్తూ లేచి నిలబడి పడమటి దిక్కుకేసి చూశాడు. సూర్యుడు అస్తమించటానికి మరెంతో కాలం లేదు. తన ఎదురుగా, ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద భవనం బురుజుల మీద, సూర్యకిరణాలు ఎర్రని కాంతులతో ప్రసరిస్తున్నవి. ఆ వెలుగులో ఎత్తయిన భవనం బురుజులు మిలమిలలాడుతున్నవి.

"ఎంత అందమైన భవనం! ఇందులో అడవిమృగాలూ, గుడ్లగూబలూ, గబ్బి



లాలూ నివసించవలసిందే గదా!'' అనుకుంటూ చిత్రసేనుడు తన దృష్టిని మరొక వైపుకు తిప్పి, నిరుత్సాహంగా బయలుదేరాడు.

అతడు ఆ విధంగా నాలుగైదడుగులు వేశాడో లేదో, అంతలో హఠాత్తుగా వెనక నుంచి "మహారాజా!" అన్న పిలుపు వినబడింది. "మహారాజెవరు? ఈ నట్టడవిలో ఈ మానవ కంఠస్వరం ఎక్కడిది?" అనుకుంటూ చిత్రసేనుడు ఆశ్చర్యపడి వెనుదిరిగి చూశాడు. అతడి కంటికి విలువైన దుస్తులు ధరించి వున్న ముగ్గురు వ్యక్తులూ, వారికి కొంచెం వెనకగా కొందరు భటులూ కనిపించారు. ఈ వింత చూసి చిత్రసేనుడు ఏమో అనబోయేంతలో, విలువైన దుస్తులు ధరించి వున్నవారిలో నుంచి ఒకడు వేరుపడి ముందుకు వచ్చి అతడికి నమస్కరిస్తూ, "మహారాజా! మీరు ఎంతకూ రాజభవనానికి రాకపోయేసరికి, మీకోసం అడవి అంతా గాలిస్తూ, చివరికి మిమ్మలను ఇక్కడ కలుసుకున్నాం," అన్నాడు.

"నేనా మహారాజును!" అంటూ చిత్రసేనుడు విస్తుపోయాడు.

చిత్రసేను డిలా అనగానే, ముందుకు వచ్చి అతణ్ణి మహారాజా అని సంబోధించిన వ్యక్తి చటుక్కున వెనుదిరిగి, "సేనానీ, మహారాజుగారు చాలా శ్రమ పడినట్టున్నారు. బోయీలెక్కడ?" అన్నాడు ఆదుర్దాగా.

"మంత్రిగారు, వాళ్ళను చెట్లచాటున ఆగి తమ ఆజ్ఞకోసం వేచి వుండమన్నారు గదా!" అంటూ సేనాని అక్కడినుంచి కదిలి, కొంతదూరం వెళ్ళి గట్టిగా చప్పట్లు చరిచాడు. ఆ వెంటనే "అయ్యా, వస్తున్నాం!" అన్న జవాబు వినబడింది. మరుక్షణంలో పల్లకీ ఎత్తుకుని బలిష్టులైన నలుగురు బోయీలు చిత్రసేనుడి దగ్గిరకు వచ్చారు.

సేనానాయకుడిచేత మంత్రి అని పిలవబడిన వ్యక్తి, ఎంతో గౌరవ పురస్స

రంగా చిత్రసేనుడిని సమీపించి వంగి ప్రణామం చేస్తూ, "మహారాజా! పల్లకీ తెప్పించాను అధిష్ఠించండి. మీకేమాత్రం అయాసం కలగకుండా బోయీలు, ఈ పల్లకీలో తమను భవనంలోని తమ పడక గదికి చేరుస్తారు," అన్నాడు.




మంత్రి అన్న ఈ మాటలు వింటూంటే, చిత్రసేనుడికి నిజంగానే తను అధిక శ్రమ చేసి వున్నందున అడుగు తీసి అడుగు వేయలేననిపించింది. ఆ కారణంగా అతను మారు మాటాడకుండా పల్లకి ఎక్కి కూచున్నాడు. 'ఊఁ' అంటూ మంత్రి బోయీలను హెచ్చరించి, అంతలో తన దగ్గిరకు వచ్చి చెవిలో ఏమో చెప్పిన వ్యక్తితో, "కోశాధికారిగారు క్షమించాలి. మహారాజుగారికి విశ్రాంతి అవసరం గనక, ఈ విషయం వీలువెంట వారితో సంప్రతించవచ్చును. ఇది సమయం కాదు," అన్నాడు.

పల్లకీలో ఎక్కి కూచున్న చిత్రసేనుడు ఈ సంభాషణ వింటూనే, "ఓహో, నాకు రాజభవనమే కాకుండా, మంత్రీ, సేనానాయకుడూ, కోశాధికారీ కూడా వున్నారన్న మాట!" అనుకున్నాడు ఎంతో ఆశ్చర్యపడుతూ.

కొద్దిసేపటి తరవాత బోయీలు చిత్రసేనుణ్ణి భవనం పై అంతస్తులోని ఒక విశాలమైన గది దగ్గిర దించారు. అతడు పల్లకీ దిగి గదిలో ప్రవేశిస్తూనే, అక్కడి ఎత్తయిన హంసతూలికా తల్పం, చక్కని మెత్తలు, కింద పరిచి వున్న విలువైన రత్నకంబళులు చూసి అతడు మరింత ఆశ్చర్యపడ్డాడు. ఇది కలా, లేక వాస్తవమా అన్న అనుమానం కూడా ఓ తృటికాలం అతణ్ణి బాధించింది.

ఇదంతా సిద్ధుడి మహిమ అనుకున్నాడు చిత్రసేనుడు. ఇంత చిన్న వెదురుబుట్టలో ఆకాశాన్నంటే మహాభవనాన్ని దాచిపెట్ట గలిగిన ఆ మహా సిద్ధుడికి, ఆ భవనంలో రాజోచితమైన ఇన్ని సౌకర్యాలూ, మంత్రి సేనానాయకుల్నీ, నౌకర్లనూ ఏర్పాటు

చేయటం పెద్ద సమస్య కాదనుకున్నా డతడు.

తనకు ఇంత మేలు చేసిన సిద్ధుణ్ణి గురించి ఎంతో కృతజ్ఞతా భావంతో చిత్రసేనుడు తలపోస్తూ వుండగా, అతడికి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం వచ్చింది. మధ్యాహ్నం నుంచి ఆకలితో నకనకలాడుతున్న అతడు తృప్తిగా భోజనం చేశాడు. తరవాత హంసతూలికా తల్పం మీద మేను వాల్చి, భావి కార్య క్రమాన్ని గురించి ఆలోచించసాగాడు.

ఇలాంటి ఆలోచనల్లోనే చిత్రసేనుడికి నిద్రపట్టింది. అతడికి మెలుకువ వచ్చే సరికి గది గవాక్షం నుంచి లేత సూర్య కిరణాలు లోపలికి ప్రసరిస్తున్నవి. తను ఒక రాత్రి ఆ అపూర్వభవనంలో గడిపా ననీ, సూర్యోదయం అయిందనీ అతడు గ్రహించాడు. వెంటనే తల్పం మీది నుంచి లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, గది నుంచి బయటికి రాబోయేంతలో మంత్రి వాకిటి దగ్గర తారసపడ్డాడు.

"మహారాజుగారు రాత్రి సుఖనిద్ర పోయారనుకుంటాను. అనుమతి అయితే, రాజ్యానికి సంబంధించిన ముఖ్య విష యాలు నివేదించగలను," అన్నాడు మంత్రి.

రాజ్యం గురించి కాని, దానికి సంబం ధించిన వ్యవహారకాండ గురించి కాని చిత్రసేనుడికి ఏమీ తెలియదు. ధవళ గిరిని తండ్రి పాలిస్తున్నాడు. ఆయన



తరవాత సింహాసనాన్ని అధిష్ఠించవలసిన వాడు అన్న శూరసేనుడు. ఆ కారణాల వల్ల చిత్రసేనుడు ఏనాడూ పరిపాలనకు సంబంధించిన వ్యవహారాల జోలికి పోవటం గాని, వాటిలో ఆసక్తి కనబరచటం గాని చేయలేదు. కాని మంత్రి వాటి ప్రసక్తి తేగానే, అతడికి చప్పున తన తలిదండ్రుల సంగతి జ్ఞాపకం వచ్చింది. తన అన్న శూరసేనుడు ఏ ప్రమాదానికీ లోనుకాకుండా ధవళగిరి నగరాన్ని చేరి వుంటే, తన క్షేమాన్ని గురించి తలిదండ్రులు చాలా ఆందోళన చెందుతూ వుంటారు. కనుక ముందుగా తన క్షేమ సమాచారాల సంగతి వారికి ఎరుకపరచటం మంచిది.

చిత్రసేనుడు ఇలా అనుకుని మంత్రితో, "మీకు ధవళగిరి నగరం గురించి తెలిసే వుంటుంది. దానికి రాజైన తారకేశ్వరుడికి, నేనిక్కడ క్షేమంగా వున్నట్టు వార్త పంపండి. తతిమ్మా విషయాలు వీలువెంట మాట్లాడదాం," అన్నాడు.

"చిత్తం, మహారాజా! అలాగే కబురు పంపుతాను. కోశాధికారి, మన కోశాగారంలో ప్రస్తుతం వున్న ధనం గురించీ, ఇతర విలువైన వస్తువుల గురించీ లెక్క కట్టి ఒక జాబితా తయారు చేశాడు. ఆ జాబితా తీసుకుని ఆయనను ఇప్పుడు ఇక్కడికి రమ్మని సెలవా?" అని అడిగాడు మంత్రి వినయంగా.





"ఆయన ఇక్కడికి రానవసరం లేదు. ఆ జాబితా ఏదో పంపమనండి, చాలు," అన్నాడు చిత్రసేనుడు.

కొన్ని నిమిషాల తరవాత, నౌకరు ఒకడు జాబితా తెచ్చి చిత్రసేనుడికి ఇచ్చాడు. ఖజానాలో నిలవ వున్న ధనం, విలువైన రత్నాలూ, బంగారు నగలూ గురించి వివరాలతో వున్న ఆ జాబితా చూస్తూనే చిత్రసేనుడు చెప్పలేనంతగా అద్భుతపడ్డాడు. ఇంత ధనం తన తండ్రి వద్ద కూడా వుండి వుండదని అతడు భావించాడు.

ఆనాటి సాయంత్రం అతడు కోశాధికారితో కలిసి, ధనాగారంలో వున్న అమూల్యమైన వస్తువులనూ, వెల లేని రత్నాలనూ పరీక్షిస్తూ వుండగా తన తండ్రి తారకేశ్వరుడు సపరివారంగా వచ్చినట్టు నౌకరొకడు వార్త తెచ్చాడు. వెంటనే చిత్రసేనుడు బయలుదేరి భవనం ముందుకు వచ్చాడు.

కుమారుణ్ణి చూస్తూనే రాజు తారకేశ్వరుడు ఎక్కడలేని సంతోషంతో అతణ్ణి కౌగలించుకున్నాడు. "నాయనా, మీ అన్న చెప్పినదాన్నిబట్టి నువ్వు ఏ అడవి మృగానికో ఆహారం అయిపోయావనుకున్నాను. కాని, నిన్ను ఇంత గొప్ప శ్రీమంతుడుగా చూసి నేను చాలా ఆనందపడుతున్నాను. ఇక్కడ నాకు తటస్థపడిన కొందరు ఉద్యోగులు చెప్పినట్టు, నువ్వు నిజంగానే ఈ పరగణాకు రాజువా? ఈ అద్భుత భవనం నీదేనా?" అని అడిగాడు అమితానందంగా నవ్వుతూ.

తండ్రి అడిగినవాటికి చిత్రసేనుడు అవునన్నట్టు తల వూపాడు.

"అయితే ఇంత గొప్ప పదవి, యింత సునాయాసంగా నీకెలా లభించింది? పూర్వం ఈ రాజప్రాసాదంలో వుంటూండే రాజు ఏమయాడు?" అన్నాడు తారకేశ్వరుడు ఆశ్చర్యంగా.

"ఆ సంగతులన్నీ ఏకాంతంగా వున్నప్పుడు చెపుతాను. నా కొలువులో వున్న

ఉద్యోగులు వినగూడని రహస్యాలు చాలా వున్నవి,'' అన్నాడు చిత్రసేనుడు రహస్యంగా.

ఆ రాత్రి ధవళగిరి రాజు తారకేశ్వరుడిని గౌరవించేందుకు, చాలా పెద్ద ఎత్తున విందులూ, వినోదాలూ ఏర్పాటయినై. వాటిల్లో రాజోద్యోగులూ, ఆ అడవిలో నివసించే వివిధ ఆటవిక జాతుల నాయకులూ పాల్గొన్నారు. తమ రాజు, ధవళగిరి రాజపుత్రుడని తెలిసినప్పుడు వారిలో ప్రతి ఒక్కరూ ఎంతో ఆనందపడ్డారు.

విందులూ, వినోదాలూ ముగిసిన తరవాత చిత్రసేనుడు తన తండ్రికి ఏకాంతంగా అన్ని విషయాలూ చెప్పాడు. సింహాలను చూసి తన గుర్రం బెదిరి కొండ ప్రాంతాలకు వెళ్ళటం దగ్గిర నుంచి, ఉగ్రాక్షుడికి తను చేసిన వాగ్దానం సంగతి కూడా అతడికి తెలియపరిచాడు.

''ఈ రాక్షసుడికి నువ్వు చేసిన వాగ్దానం నిలుపుకోవటం ఎలా? క్షత్రియుడూ, అందులో రాజూ అయినవాడెవడూ తన ప్రథమ సంతానాన్ని ఈ విధంగా రాక్షసుల పాలు చేయటం, ఏమాత్రం ధర్మసమ్మతం కాదు,'' అన్నాడు తారకేశ్వరుడు.

''నా కింకా వివాహమే కాలేదుగదా! వివాహమై, అందులోనూ మొదటిసారిగా మగపిల్లవాణ్ణి కన్నప్పుడూ, వాడు బతికి పెద్దవాడై · పద్దెనిమిదేళ్ళ వాడైనప్పుడూ, ఈ సమస్యలు ఉత్పన్నమవుతవి. అప్పటికి ఏదో ఒక తంత్రం చేసి, ఈ ప్రమాదం నుంచి బయటపడవచ్చు,'' అన్నాడు చిత్రసేనుడు.

తారకేశ్వరుడికి కొడుకు మాటలేమీ అంతగా రుచించలేదు. అట్లని ఉగ్రాక్షుణ్ణి నాశనం చేయటం సాధ్యమయే పని కాదు. ఇవన్నీ ఆలోచించి చివరకు, తారకేశ్వరుడు, ''నీ రాజ్యం, ధవళగిరి రాజ్యపు ఎల్లలను ఆనుకునే వుంది. ఏ పరిస్థితుల్లో అయినా, సహాయం కావలిసివస్తే, ఆ విషయం వెంటనే నాకు తెలియచెయ్యి,'' అన్నాడు. —(ఇంకావుంది)



# ఈర్ష్యకు ఫలితం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు యీ శ్మశానంలో పడుతున్న శ్రమ చూస్తూంటే, ఎవరైనా పరాయివాడి ఔన్నత్యం చూసి, ఈర్ష్యపడ్డావేమో అన్న అనుమానం నాకు కలుగుతున్నది. అలాంటి వాణ్ణి సాధించ దలచి, ఏవో అపూర్వశక్తుల కోసం యిన్ని కష్టాలకు ఓర్పు వహిస్తున్నావా? అదే నిజమైతే, ఏదో ఒక క్షణాన నువ్వు తప్పక ఓటమిని అంగీకరించవలసి వస్తుంది. ఇందుకు ఉదాహరణగా నీకు, ఒక తండ్రీ కొడుకుల కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

## బేతాళ కథలు



లవంగదేశంలో గల అనేక జమీల్లో, ఒకదానికి చక్రభూపతి అధిపతి. ఆయనకు పిల్లలు లేరు. తనకున్న అంతులేని ఐశ్వర్యాన్ని అనుభవించే వారసులు లేనందుకు ఆయన చాలా విచారిస్తూండేవాడు. ఎన్ని నోములు నోచినా, తీర్థయాత్రలూ, దానాలూ చేసినా ఆయనకు సంతానప్రాప్తి లేకపోయింది.

చక్రభూపతి దగ్గిర గోపాలు డనే నౌకరున్నాడు. అతడు యజమాని వయసువాడే. చిత్రంగా అతడికీ పిల్లలు లేక చక్రభూపతి లాగే వ్యథ చెందుతూండేవాడు. చక్రభూపతి చాలా సౌజన్యవంతుడు. అందువల్ల, వాళ్ళిద్దరూ యజమానీ, సేవకుడన్న మాట మరిచి, స్నేహితుల్లా ఒకరికొకరు తమ బాధల గురించి చెప్పుకుని ఓదార్పు పొందుతూండేవాళ్ళు.

ఇలా కొంతకాలం గడిచాక, చక్రభూపతి జమీందారీకి ఒక సాధువు రావడం జరిగింది. రకరకాల సమస్యలతో జనం, ఆయనను దర్శించసాగారు. సాధువు వారికి తగు పరిష్కారమార్గాలు చెబుతూండేవాడు.

కొన్నాళ్ళు గడిచాక, చక్రభూపతికి కూడా, ఆ సాధువు చాలా సాత్వికుడనీ, మహిమలు కలవాడనీ గట్టి నమ్మకం ఏర్పడింది.

ఒకనాడు ఆయన తన భార్యను వెంటబెట్టుకుపోయి సాధువు దర్శనం చేసుకున్నాడు.

సాధువు, చక్రభూపతి భార్య చేతి రేఖల్ని క్షణకాలం నిశితంగా పరిశీలించి, చిరునవ్వుతో ఆమెను ఆశీర్వదిస్తూ, ఒక తాయెత్తు ఇచ్చి, "నిరాశపడనవసరం లేదు. దీన్ని మెడలో ధరించు, తల్లీ! నీకు తప్పక సంతానం కలుగుతుంది," అన్నాడు.

చక్రభూపతీ, ఆయన భార్యా పరమానందంతో ఇంటికి తిరిగి వచ్చారు. ఆ మర్నాడే గోపాలుడి భార్య కూడా సాధు

వును దర్శించిందనీ, ఆయన ఆమెకు కూడా తన భార్యకు చెప్పినట్టే చెప్పాడనీ చక్రభూపతికి తెలియవచ్చింది.

కొన్నాళ్ళకు చక్రభూపతి భార్యా, గోపాలుడి భార్యా గర్భవతులై, మగబిడ్డల్ని ప్రసవించారు. తండ్రులిద్దరూ బ్రహ్మానందం చెంది, తమ, తమ శక్తి కొద్దీ దానధర్మాలు చేశారు. చక్రభూపతి తన కొడుక్కు కమలభూపతి అని నామకరణం చేశాడు. గోపాలుడు తన కొడుక్కు చంద్రుడని పేరు పెట్టాడు.



కమలుడూ, చంద్రుడూ పెద్దవాళ్ళవుతున్నారు. రెండు కుటుంబాలకూ వాళ్ళ తరవాత మరి సంతానం కలగలేదు. పిల్లలిద్దర్నీ వారి, వారి తలిదండ్రులు అతి గారాబంగా పెంచసాగారు.

అయితే, మితిమీరిన సంపదల మధ్య కమలుడు పెంకెగా తయారైతే, బీదరికం వల్ల బతుకులోని బరువుబాధ్యతలూ, కష్టసుఖాలూ చంద్రుడికి క్రమంగా తెలిసి రాసాగాయి.

పిల్లలిద్దరి మధ్య వున్న, ఈ ముఖ్యమైన తేడా, వాళ్ళకు పదీపన్నెండేండ్లు వచ్చేవరకూ గుర్తించలేకపోయాడు, చక్రభూపతి.

కమలుడు పాఠశాలకు వెళ్ళడం లేదు సరికదా, ఇంటి దగ్గిర కూడా ఏమాత్రం చదవక, అక్షరజ్ఞానం కూడా సరిగా లేనివాడయాడు.

చంద్రుడు తన చిన్న వయసుకు మించిన శ్రద్ధాసక్తులతో చదువుతూ, నలుగురిచేతా బుద్ధిశాలి అనిపించుకోసాగాడు.

తన కొడుకును ఎవరూ చదువుసంధ్యల్లేని మొద్దు అని బయటికి అనకపోవడానికి కారణం, తన ఐశ్వర్యమేనని చక్రభూపతి అర్థం చేసుకున్నాడు. దానితో ఆయనకు తన నౌకరు గోపాలుడి మీదా, చంద్రుడి మీదా అమితమైన ఈర్ష్యా, తన కొడుకు ప్రవర్తనపట్ల తీరని ఆవేదనా కలిగాయి.

చక్రభూపతి తన కొడుకును సరిదిద్దడానికి ప్రయత్నించాడు. అయితే, ఒక్కగానొక్క కొడుకును గట్టిగా దండించి అదుపులో పెట్టడం ఆయనవల్ల కాలేదు. ఫలితంగా కమలుడిలో మార్పేమీ రాలేదు. చక్రభూపతి మౌనంగా మనోవేదన పొందసాగాడు.

ఈ పరిస్థితుల్లో, ఉన్న ఊరిలో గురువు చేత మెప్పుపొందిన చంద్రుడికి, కాశీలోని విద్యాలయానికి వెళ్ళి చదువుకోవాలన్న బలమైన కోరిక కలిగింది.

ఆ సంగతి వాడు తండ్రితో చెప్పినప్పుడు, "అక్కడ నీకు కావాలంటే ఉచితభోజన వసతులు లభించవచ్చు. కాని, ప్రయాణపు ఖర్చులకూ, ఇతరత్రా వాటికీ డబ్బు అవసరం అవుతుంది గదా! అది సమకూర్చడం, నా శక్తికి మించిన పని అని, నీకు తెలియదా?" అన్నాడు బాధగా.

తన తండ్రి ఆర్థికపరిస్థితి ఎరిగిన చంద్రుడు, మరేమీ మాట్లాడలేక తల వంచుకుని వూరుకున్నాడు.

రెండు రోజుల తర్వాత చంద్రుడికి చదువు చెప్పిన గురువు, గోపాలుడికి కనిపించి, "గోపాలా, మీవాణ్ణి పైచదువులకు కాశీకి పంపలేనన్నావట! ఎన్నెన్నో పెద్ద కుటుంబాల పిల్లలకంటే, నీ కొడుకు ఎంత తెలివైనవాడో, నీవు ఏమాత్రం గ్రహించినట్టు కనబడడం లేదు. అలాంటి వాణ్ణి, తల తాకట్టుపెట్టి అయినా చదివిం



చాలిగాని, నిరుత్సాహపరచకూడదు.'' అని చెప్పాడు.

ఆ మాటలతో గోపాలుడు ఆలోచనలో పడ్డాడు. గురువు చెప్పినట్టు కొడుకును ఏదో విధంగా ఉన్నత విద్యకు పంపాలని నిర్ణయించుకుని, తన యజమాని దగ్గిరకు వెళ్ళాడు.

అతడు చక్రభూపతికి సంగతివివరించి, ''తమకు కొంతధనం అప్పుగా యిచ్చి, నెల, నెలా నా కిచ్చే జీతంలో నుంచి కొంత మినహాయించుకోండి,'' అన్నాడు వినయంగా.

తన కొడుకు కమలుడి పరిస్థితినీ, నౌకరు కొడుకైన చంద్రుడి ఔన్నత్యాన్నీ సరిపోల్చుకుని కుమిలిపోతున్న చక్ర భూపతికి, గోపాలుడి మాటలతో విపరీతమైన కోపం వచ్చింది.

ఆయన మరో ఆలోచన లేకుండా వెంటనే, ''నీకూ వృద్ధాప్యం మీద పడుతున్నది. అప్పుగా ఎంత డబ్బు అవసరమో చెప్పలేదు. ఆ అవసరం ఎంతఅయినా— నెల, నెలా కొంత చొప్పున అప్పు ఏనాటికి తీర్చగలవు? అట్టే దురాశలకుపోక, నీ కొడుకును అంతటితో చదువు చాలించి, ఏదైనా పనిలో చేరమను,'' అన్నాడు.

గోపాలుడు మరేమీ మాట్లాడకుండా, విచారపడుతూ వెళ్ళిపోయాడు.

ఈ జరిగినదానికి చిరాకుపడుతూ, చక్రభూపతి చల్లగాలి కోసం చెరువుగట్టు కేసి బయలుదేరాడు. ఆయన అక్కడ





ఒక చెట్టుకింద కూర్చుందామనుకుంటూం డగా, దాపులనున్న ఒక చెట్టు నీడలో కమలుడూ, చంద్రుడూ మాట్లాడుకుం టూండడం కంటబడింది.

వాళ్ళిద్దరూ స్నేహితుల్లా మాట్లాడు కుంటున్నారా లేక శత్రువుల్లా కవ్వించు కుంటున్నారా? వినాలనుకుంటూ చక్ర భూపతి వాళ్ళున్న చెట్టు వెనక్కు వెళ్ళి నిలబడ్డాడు.

కమలుడు ఎంతో కఠినంగా, చంద్రు డితో, "నీ ప్రయత్నం గురించి విన్నాను. ఏమైనాసరే, యింకా పై చదువులకు నువ్వు కాశీకి వెళ్ళడానికి వీల్లేదు," అంటున్నాడు.

అందుకు చంద్రుడు శాంతంగా, "నువ్వు, నన్ను కాశీకి వెళ్ళడానికి వీల్లేదు అని తప్ప, అందుకు కారణం ఏమిటో చెప్పడం లేదు. మానాన్న, నన్ను పంపే విషయంలో పట్టుదలగా వున్నాడు. జమీం దారుగారిని డబ్బుకోసం అప్పు అడుగు తానని కూడా చెప్పాడు. ఆయన తప్పక సహాయం చేస్తారన్న విశ్వాసం, నాకున్నది," అని జవాబిచ్చాడు.

"అప్పులతోగాని కాని పెద్ద చదువు లెందుకు? ఆ ఆలోచన మాను. నేను ఉచితంగా డబ్బిస్తాను. ఎక్కడికైనా వెళ్ళి, ఏదైనా నౌకరీ సంపాయించుకో," అన్నాడు కమలుడు.

"నాకిప్పుడు డబ్బవసరం చదువు కోసమే! అలాకానప్పుడు, నాకు డబ్బుతో అంత అవసరం ఏమిటి?" అన్నాడు చంద్రుడు.

ఆ జవాబు వింటూనే కమలుడు అక్కడినుంచి గిరుక్కున తిరిగి, గ్రామం కేసి బయలుదేరాడు.

ఈ సంభాషణ విన్న చక్రభూపతికి చాలా ఆనందం కలిగింది. ఆయన ఇంటికి తిరిగివస్తూనే గోపాలుణ్ణి పిలిచి, "ఇదుగో, ఈ ఐదువందల వరహాలూ తీసుకో. నీ కొడుకును కాశీకి పంపు. తర్వాత యింకా డబ్బు అవసరపడితే,

సంకోచించక అడిగి తీసుకో. చంద్రుడి చదువుకు అయ్యేవ్యయం అంతా నాది. నువ్వు చిల్లిగవ్వ కూడా తిరిగి తీర్చ నవసరం లేదు," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, చక్రభూపతిలో అంత హఠాత్తుగా మార్పు రావడానికి కారణం ఏమిటి? చంద్రుడికి గల విద్యా తృష్ణా లేక అతడికి తనపై గల విశ్వాసమా? తన కుమారుడికి చదువు అబ్బలేదని బాధపడుతున్న ఆయన, చంద్రుడికి అంత నిస్వార్థంగా ధన సహాయం ఎలా చేయగలిగాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చంద్రుడూ, తన కొడుకూ మధ్య జరిగిన సంభాషణ విన్న చక్రభూపతికి, ఒక వాస్తవం తెలియవచ్చింది. అదేమంటే—చంద్రుడి విద్యా ప్రాభవాన్ని చూసి కమలుడు ఈర్ష్యపడుతున్నాడు. తనలో కూడా అభివృద్ధి చెందాలన్న ఆకాంక్ష కలిగినప్పుడే, ఎవరైనా ఎదుటి వ్యక్తి గొప్పదనాన్ని మనస్ఫూర్తిగా అంగీకరిస్తారు. ఇలాంటి మార్పు కమలుడిలో వచ్చినట్టు, చక్రభూపతి గ్రహించాడు. అది, అతడి అభివృద్ధికి పునాదివంటిది. అంతేకాక, చంద్రుడిపై కమలుడికి గల ఈర్ష్య చాలా పరిమితమైనది. అందువల్లనే, చంద్రుడు తన పట్టు వదలకపోతే, కమలుడు వెనుదిరిగి వెళ్ళాడే తప్ప, అతడిపై దౌర్జన్యానికి పూనుకోలేదు. ఈ విధంగా, తన కొడుకులో వచ్చిన మంచి మార్పు గుర్తించడం వల్లనే, చక్రభూపతి, చంద్రుడి ఉన్నత విద్యకు ఆర్థిక సాయం చేశాడు. అంతేగాని, అతడికి గల విద్యా తృష్ణా, తనపై గల విశ్వాసం కారణాలు కావు. పైగా, చక్రభూపతి చేసిన, ఈ సాయం పూర్తిగా స్వార్థంతో కూడినది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# జ్ఞానబోధ

రామాపురం అనే గ్రామానికి, ఎక్కడి నుంచో ఒక వేదాంతి వచ్చి, సత్రం అరుగు మీద కూర్చుని ధర్మం, న్యాయం, సత్ప్రవర్తనల గురించి బోధలు చేయసాగాడు. గ్రామంలో చాలా మంది ఆయన బోధలు వినడానికి వెళ్ళసాగారు. వేదాంతి వాళ్ళతో, రోజూ ఒక గుప్పెడు బియ్యం, ఐదు పైసలు తెస్తూండండని చెప్పాడు. జనం అలాగే చేశారు.

ఒకనాడు, ఆ గ్రామంలో బాగా చదువుకున్నవాడని పేరు పడిన, శరభయ్య అనే ఆసామీ వేదాంతికి భక్తిపూర్వకంగా నమస్కరించి, "స్వామీ, మీ బోధలు విన్న తర్వాత, అప్పటివరకూ అపమార్గాన నడిచే చాలామంది, సన్మార్గవర్తనులయ్యారు. గ్రామంలో తంపులూ, జగడాలూ కూడా చాలా తగ్గిపోయినై. కాని, తమను గురించి నన్నొక అనుమానం వేధిస్తున్నది. అనుమతిస్తే, అడగదలిచాను," అన్నాడు.

"నిర్భయంగా అడుగు, నాయనా!" అన్నాడు వేదాంతి.

"తమరు చేసే బోధల్లో తరచూ ఆశ పనికి రాదనీ, ధనాపేక్ష కూడదనీ చెబుతూంటారు. అలాంటి మీరు, గ్రామస్థులను బియ్యం, పైసలూ తెమ్మనడం ఏం బావుంది?" అన్నాడు శరభయ్య.

ఆ మాటలకు వేదాంతి నవ్వి, "నాయనా, నీ మాటల ద్వారా తెలుస్తున్నదేమంటే నా బోధలు గ్రామస్తులకు మేలు చేస్తున్నవని. కొద్ది రోజుల తర్వాత ఇదే మేలు, పొరుగు గ్రామస్థులకు కూడా చేయదలిచాను. అందుకు నేను బతికుండాలిగదా!" అన్నాడు.

ఆ మర్నాటి నుంచీ గ్రామస్థులు వేదాంతికి బియ్యంతోపాటు ఉప్పూ, పప్పూ, కూరగాయలు కూడా తెచ్చి యివ్వసాగారు.

—భైరి సత్యనారాయణ






మన దేవాలయాలు :

# శ్రీరంగం

శ్రీరంగం దేవాలయంలో శేషశయన రంగనాథ విగ్రహం ఉన్నది. ఇది ఒకప్పుడు అయోధ్యానగరంలో ఉండేదట. శ్రీ రామచంద్రుడి పూర్వులు ఈ విగ్రహాన్ని పూజించేవారనీ, ఆ విగ్రహం అయోధ్య రామ భవనం నుంచి ఇక్కడికి తీసుకురాబడిందనీ చెబుతారు.

రావణుని సంహరించి, సీతను పరిగ్రహించి, లంకనుంచి రాముడు అయోధ్యానగరానికి తిరిగి వచ్చినప్పుడు, విభీషణుడు వారి వెంట వచ్చాడు. అతడు అయోధ్యా రాజభవనంలోని విగ్రహాన్ని చూసి మక్కువ పడడంతో, దానిని రాముడు అతనికి ఇచ్చాడు.





లంకను చేరేవరకు, విభీషణుడు ఆ విగ్రహాన్ని ఎక్కడా దించకూడదన్న నియమం విధించబడింది. కాని శ్రీరంగం మీదుగా వెళుతున్నప్పుడు, అతడు దానిని కింద పెట్టాడు. ఆ తరవాత ఎంత ప్రయత్నించినా విగ్రహాన్ని పైకి ఎత్తలేక పోయాడు.





విగ్రహం చుట్టూ ఆలయం వెలసిన తరవాత, ఆ స్థలం దివ్యక్షేత్రంగా ప్రసిద్ధిగాంచింది. ఎందరెందరో భక్తులు, మహనీయులు రంగనాథ దేవాలయాన్ని దర్శించసాగారు. ఆండాళ్ (గోదాదేవి) అనే భక్తురాలు రంగనాథుని సేవించి, ఆయనలో ఐక్యమయింది.

క్రమక్రమంగా దేవాలయ ప్రాంగణం రకరకాల సాంస్కృతిక కార్యక్రమాలకు నిలయమయింది. సుప్రసిద్ధ తమిళకవి కంబన్, రామాయణాన్ని రచించి, మొట్టమొదట భక్తుల సమక్షంలో చదివి ఈ ఆలయంలోనే రంగప్రవేశం కావించాడు.





పన్నెండవ శతాబ్దంలోనూ, పదహారవ శతాబ్దంలోనూ ఢిల్లీ సుల్తానులు ఈ ఆలయం మీదికి దండెత్తి వచ్చారు. ఒక సుల్తాను గర్భగృహంలోని విగ్రహాన్ని ఎత్తుకుపోవాలని ప్రయత్నించాడు. కాని, భక్తులు విగ్రహాన్ని తిరుపతి క్షేత్రానికి తీసుకుపోయి భద్రపరిచారు. ఉత్సవమూర్తిని మాత్రం సుల్తాన్ తరలించుకు పోయాడు.

రామానుజాచార్యులు సుల్తానును కలుసుకుని, ఉత్సవవిగ్రహాన్ని మళ్ళీ శ్రీరంగానికి తీసుకుపోవడానికి అనుమతి కోరాడు. సుల్తాను అందుకు అంగీకరించాడు.






అయితే, సుల్తాను కుమార్తె ఆ విగ్రహం పట్ల అవ్యాజప్రేమను పెంచుకున్నది. విగ్రహాన్ని తీసుకు వెళుతున్న బండి వెనకగా నడవసాగింది. ఆమె జ్ఞాపక చిహ్నంగానే, శ్రీరంగం ఆలయంలో కొన్ని ముస్లిం సంప్రదాయాలు ప్రవేశ పెట్టబడ్డాయి.

ఒకసారి సుల్తాను సేనానాయకుడు ఒకడు, దేవాలయాన్ని నేలమట్టం చేయడానికి రహస్యంగా కుట్ర చేయసాగాడు. ఈ విషయంగా అతడు సహచరులతో రహస్యమంతనాలు జరపడం, ఆలయ నర్తకి ఒకామె చాటు నుంచి విన్నది.





ఆ నర్తకి, సేనానాయకునికి గోపుర శిఖరం మీద నిధి ఉన్నది చూపుతా రమ్మని ఆశచూపి, మంచిగా మాట్లా డుతూ, అతణ్ణి గోపురాగ్రానికి తీసుకు పోయింది. అతడు ఏమరుపాటులో ఉన్న సమయం చూసి, ఆమె అతని కాలికింది రాతిని లాగివేసింది. వాడు గోపురం మీదినుంచి కిందపడి ప్రాణాలు కోల్పోయాడు.

ఏడు ప్రాకారాలతో, వేయి స్తంభాల మంటపంతో, ఓంకార విమానంతో —వెలుగొందుతున్న శ్రీరంగం దేవాల యంలో అపురూపశిల్పాలు చెక్కబడి ఉన్నాయి.





ఈ దేవాలయంలో జరిగే ఉత్స వాలలో ప్రధానమైనది వైకుంఠఏకాదశి. యోగమాయాస్వరూపిణి అయిన ఏకా దశీదేవి ముర అనే రాక్షసుని సంహరిం చిన శుభదినమే ఏకాదశి. ఏకాదశీ పుణ్యదినాన శ్రీరంగనాథుని దర్శిం చడం పుణ్యప్రదమని భక్తులు విశ్వ సిస్తారు.



# మల్లప్ప ఉపాయం

సోమన్న పరమ తుంటరిమనిషి. వాడింటికి అటూ, ఇటూ సూరయ్యా, మల్లప్పల ఇళ్ళున్నవి. పొరుగిళ్ళవాళ్ళను ఏదో విధంగా తిట్టి, కవ్వించి వినోదించడం సోమన్న అలవాటు. అందుకోసం వాడు, వాళ్ళ మీద వెకిలిపాటలు కట్టి గొంతెత్తి పాడేవాడు. వాళ్ళు దారిలో ఎదురైతే, వేళాకోళంగా నవ్వి, పలకరించకుండా వెళ్ళిపోయేవాడు.

అయితే, మల్లప్ప ఇలాంటివి పట్టించుకునేవాడు కాదు. వాడు సోమన్న ఆగడాలన్నీ భరించి వూరుకునేవాడు. సూరయ్య మాత్రం అలా వూరుకోలేక, చాలాసార్లు సోమన్నతో గొడవ పెట్టుకున్నాడు. వాడిక్కావలసింది అదే గనక—వాడు పెద్దగా అరుస్తూ, సూరయ్య మీదికి వెళ్ళేవాడు. దాంతో సూరయ్య హడలిపోయి చల్లగా ఇంట్లోకి వెళ్ళేవాడు.

సోమన్న మాత్రం అతడితో ఆ గొడవ వదిలిపెట్టక, "నన్ను రెచ్చగొడితే, నేను మనిషిని కాదు. చూడు, నిన్నేం చేస్తానో!" అని ప్రతిజ్ఞ చేసేవాడు.

సోమన్న నోటి దురుసుతనంతోపాటు, పక్క ఇళ్ళవాళ్ళను బాధపెట్టేందుకు, తన ఇంటి ముందు పోగయిన తుక్కునంతా, వాళ్ళ ఇళ్ళ ముందుకు తుడిపించసాగాడు. ఇలా చేస్తే, సూరయ్యతోపాటు మల్లప్ప కూడా తన మీదికి దెబ్బలాడ వస్తాడనీ, అప్పుడు అతణ్ణి నాలుగు తిట్టి వినోదించవచ్చునీ ఆశపడ్డాడు. కాని, మల్లప్ప యీ సంగతే పట్టించుకోలేదు. తనతోపాటు మల్లప్ప కూడా కలిస్తే, సోమన్నకు బుద్ధి చెప్పవచ్చని సూరయ్య ఆలోచించాడు.

సూరయ్య, ఈ సంగతి మల్లప్పతో అన్నప్పుడు మల్లప్ప, తేలిగ్గా నవ్వేసి,

జొన్నలగడ్డ రామలక్ష్మి



"చూడు, సూరయ్యా! ఇరుగు పొరుగులతో గొడవలుపడడం, నాకిష్టముండదు," అన్నాడు.

ఈ జవాబు సూరయ్యకు కోపం తెప్పించింది. వాడు ఆ కోపంలో, ఒకనాడు మల్లప్ప చూడకుండా, తన ఇంటి ముందున్న చెత్తా చెదారాన్ని వాడింటి ముందు పడవేశాడు. అయినా, మల్లప్ప ఏమీ పట్టించుకోలేదు.

ఇలా రెండు రోజులు గడిచాక సూరయ్య, మల్లప్పను పలకరించి, "ఆ సోమన్న, నీకూ, నాకూ పోట్లాటపెట్టాలని, నా ఇంటి ముందు తుక్కు కూడా, నీ ఇంటి ముందుకు తోస్తున్నాడు. రానురాను వాడి ఆగడాలు మితిమీరి పోతున్నవి. ఇందుకు మనం ఏదైనా చేయాలి," అన్నాడు.

అందుకు మల్లప్ప, "వాడి బుద్ధి నీకు తెలిసిందిగదా! మనం గొడవ లేపకుండా వుంటే సరిపోతుంది. నాకు నువ్వంటే నమ్మకమే," అన్నాడు.

సూరయ్య తెల్లబోయి, "అయితే మాత్రం, ఇంత తుక్కు, నీ ఇంటి ముందు వేస్తూంటే, చూస్తూ వూరుకుంటావా?" అని అనిగాడు.

"దానికేముంది? ఇంటి ముందెలాగూ రోజూ శుభ్రం చేసుకుంటాం గదా—పనిలో పనిగా, ఆ తుక్కు కూడా తుడిచేస్తే సరిపోతుంది," అన్నాడు మల్లప్ప చాలా నెమ్మదిగా.

"నువ్విలా వుండబట్టే, ఆ సోమన్నగాడు మరీ అలా బరితెగించిపోతున్నాడు. ఏది ఏమైనాసరే, వాడికి తగిన శాస్తి చేయాల్సిందే," అన్నాడు సూరయ్య కోపంగా.

మల్లప్ప ఎంతో శాంతంగా, "ఒక సంగతి బాగా గుర్తుంచుకో, సూరయ్యా. ఇంటి ముందు కాస్త తుక్కున్నా, ఎక్కువ తుక్కున్నా, దానిని తుడవడానికి పట్టే సమయంలో ఆట్టే తేడా వుండదు. అలా కాక, సోమన్నతో కాస్త గొడవల్లోకి

దిగామంటే, బోలెడు కాలం వృథా,'' అన్నాడు.

''అలా అని వూరుకుంటే, వాడు మనని చేతకానివాళ్ళని అనుకోడా?'' అన్నాడు సూరయ్య.

''మనం చేతకానివాళ్ళం కానప్పుడు, వాడలా అనుకుంటే మాత్రం ఏం నష్టం? ఒకవేళ మనం నిజంగానే చేతకాని వాళ్ళం అనుకో! అప్పుడు, వాడలా అనుకోవడంలో తప్పు లేనట్టే గదా?'' అన్నాడు మల్లప్ప.

సూరయ్య కొంచెంసేపు ఆలోచించి, ''తలుచుకుంటే మనం కూడా, వాణ్ణి— వాడికన్న వందరెట్లు ఎక్కువగా బాధలు పెట్టగలం!'' అన్నాడు.

''అదెలా సాధ్యం, సూరయ్యా? ఆ సోమన్నగాడికేపనీ లేదు; మనకు బోలెడు పనులు. అయినా, ఉపాయశాలి ఎటువంటి యిబ్బందినైనా, తనకనుకూలంగా మార్చుకుంటాడు. సోమన్న, నాకు మహోపకారం చేశాడనే చెప్పాలి!'' అన్నాడు మల్లప్ప.

''సోమన్న, నీకు ఉపకారం చేశాడా?'' అని చెప్పలేనంత ఆశ్చర్యంగా అడిగాడు సూరయ్య.

''అవును! సోమన్న అగడాలు నాకూ, మా ఇంట్లోవాళ్ళకూ భరించడం కష్టంగానే వున్నది. వాణ్ణి తలచుకుంటే, మాకూ ఒళ్ళు మండిపోతుంది. అందుకని, వాణ్ణి తలవనేతలవరాదని నిశ్చయించుకున్నాం.



వాణ్ణి తలవకుండా వుండాలంటే, ఎవరికీ తీరుబడి వుండకూడదు,'' అన్నాడు మల్లప్ప.

''అందుకు నువ్వేం చేశావు?'' అని అడిగాడు సూరయ్య.

''నేను మామూలుకంటే ఎక్కువగా పొలం పనుల్లో వుండిపోతున్నాను. మా ఇంట్లో మిగతావాళ్ళందరూ బుట్టలల్లడం, చాపలు నేయడం, బొమ్మలు చేయడం లాంటి పనుల్లో క్రమంగా ప్రావీణ్యం సంపాయించారు. అందువల్ల, కుటుంబానికి అదనపు ఆదాయం వస్తున్నది. దీన్నిబట్టి చూస్తూంటే, సోమన్నవల్ల మాకు ఉపకారం జరిగిందని, నీకూ అనిపించడం లేదా?'' అని అడిగాడు మల్లప్ప.

ఇది విని సూరయ్య తెల్లబోయాడు. మల్లప్పకు వస్తానని చెప్పి ఇంటికిపోయి, భార్యకు సంగతి వివరించాడు.

''అయ్యో, నాకీ ఆలోచన రానేరాలేదు. మనమూ, మల్లప్పలాగే చేద్దాం,'' అన్నది సూరయ్య భార్య.

ఆనాటి నుంచీ సూరయ్యా, వాడి కుటుంబం మల్లప్పలాగే చేయసాగారు. అందువల్ల, వాడికీ ఆదాయం పెరిగింది. సోమన్నను గురించి ఆలోచించడానికే వ్యవధి వుండడం లేదు.

ఇలా కొంతకాలం జరిగేసరికి సోమన్న ఇంటికి అటూ, ఇటూ రెండు డాబా ఇళ్ళు లేచాయి. తన అల్లరీ, తిట్లూ సూరయ్యా, మల్లప్పలు పట్టించుకోక పోవడం సోమన్నకు పెద్ద బాధగా తయారైంది.

ఆ బాధకు తోడు వాళ్ళు డాబా ఇళ్ళు కట్టడం చూసి సోమన్న చెప్పలేనంతగా మనోవ్యాధికి గురి అయి, ''నా కారణంగానే వీళ్ళు పూరిపాకల స్థాయి నుంచి, డాబా యిళ్ళస్థాయికి ఎదిగిపోయారు. మరి కొంతకాలం నేనిక్కడ వుంటే, వీళ్లు పెద్ద పెద్ద మేడలే కట్టవచ్చు!'' అని ఆలోచించి, తన పూరి పాకను అయిన కాడికి తెగనమ్మి, మరో వూరుకు వెళ్ళి పోయాడు.





# శివలీలలు

శివభక్తుడైన చిరుతొండడిని చూడాలని పార్వతీదేవి కోరింది. అప్పుడు శివుడు ఇంద్రుడితో కాంచీపురం ప్రాంతాలలో ఎడతెగని వానలు కురిపించమన్నాడు. కాంచీపురంలో ఇరవైఒక్క రోజు ఎడతెగని వర్షం కురిసి, ఇరవై రెండో రోజున వెలిసింది. ఈ మూడు వారాలూ చిరుతొండడు శివభక్తులకు రాత్రిం బగళ్ళు భోజనాలు పెడుతూనే వచ్చాడు. వంటచెరుకు లేక పోతే గుడ్డలు నూనెలో తడిపి అంటించి, వంటలు చేయించాడు. అంతేగాని ఆ గడ్డు రోజులలో కూడా తన వ్రతానికి భంగం రానియ్యలేదు.

కాని, తీరా వాన వెలిసిన రోజున చిరుతొండడి ఇంట అతిథి లేకుండా పోయాడు. కనీసం ఒక శివభక్తుడికైనా భోజనం పెట్టి గాని చిరుతొండడు భోజనం చెయ్యడు. అది అతని నియమం. అతను మధ్యాహ్నం వేళ బయటికి వచ్చిచూశాడు. పంచ అరుగుల మీద ఒక్క శివయోగి కూడా లేడు. అందుచేత చిరుతొండడు అతిథుల కోసం వెతుకుతూ వీధుల వెంట పడ్డాడు. కోట ఆవరణలో ఎక్కడా ఒక శివభక్తుడు దొరకలేదు. చిరుతొండడు కోట దాటి బాహ్య ప్రదేశాలలో వెదక సాగాడు.

ఒక తోటకు సమీపంలో ఒక పాడు పడిన గుడిలో ఇద్దరు వృద్ధ దంపతులు అతనికి కనిపించారు. ముసలివాడి జుట్టు నెరిసి జడలు కట్టి ఉన్నది; ముఖాన

3. చిరుతొండనంబి శివదీక్ష



విభూతి రేఖ లున్నాయి. ముసలావిడ గుడ్డిది; పులిచర్మం మీద పడుకుని ఉన్న ముసలాయన పాదాలు ఒత్తుతున్నది.

చిరుతొండడు వారికి చేతులెత్తి నమస్కారం చేసి, "ఇవాళ మీరిద్దరూ మా ఇంటికి వచ్చి శివార్చన చేసి, నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి," అన్నాడు.

దానికి ఆ వృద్ధుడు, "ఏడాదిగా నేను శివుణ్ణి ఉద్దేశించి నిరాహార వ్రతం చేస్తున్నాను. ఆ వ్రతానికి ఉద్యాపన నరమాంసంతో గాని కాదు. నరపశువు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలలో దేనికైనా చెందినవాడు కావాలి; చిన్న వయసువాడూ, ఆరోగ్యవంతుడూ కావాలి. వాణ్ణి తల్లితండ్రులు చంపి, వండి వడ్డించాలి. నువు కూడా నా పంక్తిన కూర్చొని తినాలి," అన్నాడు.

"నన్ను చిరుతొండనంబి అంటారు. శివభక్తుల వ్రతాలు కొనసాగించటమే నా వ్రతం. తమరు కోరినట్టు భోజనం పెడతాను. మా ఇంటికి దయచెయ్యండి," అన్నాడు చిరుతొండడు.

"నువు ఒప్పుకుంటే చాలుతుందా? నీ భార్య కూడ నా నియమానికి ఒప్పుకోవాలి," అన్నాడు వృద్ధుడు.

చిరుతొండడు తన భార్యను ఒప్పించటానికి ఇంటికి వచ్చి, తిరువెంగనాంచితో సంగతంతా చెప్పాడు.

"మన మాంసం కోసి వండి పెట్టటానికైనా మనం సిద్ధమే గద. వెంటనే వెళ్ళి వారిని తీసుకురండి," అన్నదామె.

ఈ లోపల, ముసలి రూపంలో ఉన్న శివుడు వేరొక రూపంలో సిరియాలుడు చదువుకునే పాఠశాలకు వెళ్ళి, ఆ కుర్రవాడితో, "నాయనా, మీ తండ్రి పరమ దుర్మార్గుడు; నిన్ను చంపి ఎవరో జోగికి వండి పెట్టబోతున్నాడు. వెంటనే పారిపో," అన్నాడు.

"అయ్యా, మీరు చెప్పేది చిత్రంగా ఉన్నది. పరోపకారార్థ మిదం శరీరం అన్నారు. దధీచీ, శిబీ మొదలైనవాళ్ళు



అజ్ఞానులా ?'' అని సిరియాలుడు జవాబు చెప్పాడు.

చిరుతొండడు తిరిగి దేవాలయానికి వచ్చి, ముసలి బ్రాహ్మణుణ్ణి ఎత్తుకుని, గుడ్డి అవ్వను నడిపించుకుంటూ ఇంటికి వచ్చాడు.

తలిదండ్రులు సిరియాలుడికి తలంటి పోసి స్నానం చేయించి, అలంకరించి, ''నాయనా, శివయోగికి ఆహారమవుతావా ?'' అని అడిగాడు.

''సంతోషంగా అవుతాను,'' అన్నాడు సిరియాలుడు.

తల్లి తన కొడుకును ఒడిలో పడుకోబెట్టుకున్నది. చిరుతొండనంబి కొడుకును చంపాడు. సిరియాలుడి మాంసం వండి ఆ భార్యా భర్తలు వృద్ధ దంపతులకు వడ్డించారు. ముసలివాడు చిరుతొండ నంబితో, ''నువ్వూ, నీ కొడుకూ నా పంక్తిన భోజనం చెయ్యండి మరి,'' అన్నాడు.

''మా అబ్బాయి ఎటో వెళ్ళి ఉంటాడు. వంటకాలు చల్లబడతాయి. మీరు ఆరగించండి,'' అన్నాడు చిరుతొండడు.

''నీ భార్యను కేక పెట్టమను. పిల్లవాడు వస్తాడు,'' అన్నాడు ముసలివ్వాడు.

తిరువెంగనాంచి, ''నాయనా, సిరియాలా! రారా!'' అని కేక పెట్టింది.

సిరియాలుడు పరిగెత్తుకుంటూ వీధిలో నుంచి లోపలికి వచ్చాడు.

చిరుతొండడు వృద్ధ దంపతులకేసి తిరిగేసరికి అతనికి పార్వతీపరమేశ్వరులు అసలు రూపంలో కనిపించారు! వారు అతని శివభక్తికి మెచ్చుకుని, అతని పూర్వ జన్మకథ తెలిపారు.

దక్షిణాన పొత్తపినాడు అనే ప్రాంతంలో అరణ్యం ఉండేది. అందులో శబరులు ఉంటూ ఉండేవారు. ఉడుమూరు అనేది వాళ్ళ ముఖ్య నగరం. ఆటవికులైన శబరులు వేటాడీ, వ్యవసాయం చేసీ జీవిస్తూ ఉండేవారు.

శబరులకు రాజు నాథనాథుడు. అతని భార్య పేరు తండె. వారికి తిన్నడు అనే

కుమారుడు కలిగాడు. వాడు పెద్దవాడవుతూ, విలువిద్య నేర్చుకున్నాడు. వాడికా విద్య పుట్టుకతోనే వచ్చినట్టు కనబడింది. ఎందుకంటే, విల్లు పట్టుకున్న నలభై రోజులకే వాడు అరణ్యంలో పరిగెత్తే లేడినీ, ఆకాశంలో ఎగిరే పక్షినీ కొట్టగలిగాడు.



శబరులు తమ రాజుతో తిన్నడికి వేట విద్యలు నేర్పాలన్నారు. ముందుగా శబరులందరూ శివుడికి పూజలు చేసి, వేటలు బలి పెట్టి, తాగి తందనాలాడి ఉత్సవం జరిపారు. మర్నాడు శబరరాజు తన కొడుకు వెంట వేటకు వెళ్ళవలసిన వారిని ఎన్నుకుని, వేటకు కావలసిన ఉచ్చులూ, వలలూ, కుక్కలు మొదలైన జంతువులూ సిద్ధం చేశాడు. పెద్ద సన్నాహంతో తిన్నడు తన జాతివాళ్ళను వెంటబెట్టుకుని తిరుపతి కొండలకేసి బయలుదేరాడు.

వేట చాలా విజయవంతంగా సాగింది. శబరులు రకరకాల అడవి జంతువులనూ, పక్షులనూ చంపారు; మాంసం ముక్కలు పుల్లలకు గుచ్చి కాల్చి, అడవి తేనెతో కలిపి తిన్నారు. ఈ విధంగా వన్యమృగాలను వేటాడుతూ వాళ్ళు చాలా రోజులు అడవిలోనే మకాం పెట్టారు.

ఒకనాడు తిన్నడు వేటాడి అలసి, ఒక పొగడచెట్టు నీడలో నిద్రపోయాడు. ఆ నిద్రలో వాడికి ఒక కల వచ్చింది. కలలో ఒక మహాపురుషుడు కనిపించాడు. ఆ మనిషి ఒంటి నిండా విభూతి పూసుకుని, పులితోలు కట్టుకుని, ఎర్రటి జెడలు వేళ్ళాడుతూ, భుజాన పుర్రెల మాల ధరించి, మెడలో లింగాన్ని ధరించి ఉన్నాడు. ఆయన తిన్నడితో ప్రేమగా, "అబ్బాయీ, ఇక్కడ కొండ పక్కన, సువర్ణముఖినదీ తీరాన, మర్రిచెట్టు కింద శివుడున్నాడు. అక్కడికి వెళ్ళి పూజించు, నాయనా!" అని చెప్పి అంతర్ధానమయాడు.

తిన్నడు అదిరిపడి నిద్ర లేచి, ఆశ్చర్యంతో నాలుగు దిక్కులా చూశాడు.

తన తోటి వాళ్ళు వేటలో నిమగ్నులై ఉన్నారు. వాళ్ళ ఈలలూ, కేకలూ వినిపిస్తున్నాయి. అంతలో ఒక అడవి పంది వేటగాళ్ళను తప్పించుకుని, గుర్రు గుర్రుమని అరుస్తూ, పరిగెత్తుకుంటూ రావటం తిన్నడి కంట పడింది. వాడు దాన్ని కొట్టటానికి వెంట తరిమాడు. ఆ అడవిపంది వాడికి అందకుండా అమితవేగంతో పరిగెత్తుతూ, చాలా దూరం తిప్పి, అకస్మాత్తుగా ఒక చోట అదృశ్యమయింది.

అది మాయమైన చోటనే శివాలయం ఉన్నది. కలలో తిన్నడికి కనిపించిన మహాపురుషుడు చెప్పినది ఈ శివుణ్ణి గురించే. అందుచేత జరిగిన దంతా శివ మాయ అని గ్రహించి, తిన్నడు ఆనంద బాష్పాలు రాల్చుతూ ఆ లింగానికి సాష్టాంగ నమస్కారం చేసి, "స్వామీ, ఈ కొండ ప్రదేశంలో పులులూ, సింహాలూ సంచరించే చోట ఏటి ఒడ్డున ఎందుకు కూర్చున్నావు? నికు ఆకలి అయితే తిండీ, నీరూ ఎవరు తెచ్చిపెడతారు? మా ఉడుమూరికి రావయ్యా! చిన్నక్కలూ, పెద్దక్కలూ నీకు పంది మాంసమూ, దుప్పి మాంసమూ, పిట్టల మాంసమూ కమ్మగా వండి పెడతారు; రకరకాల బియ్యాలతో పాయసం వండి పెడతారు; రకరకాల తేనెలూ, పళ్లూ నీకు లభిస్తాయి. మా వూరికి వచ్చెయ్యి. నా వెంట వచ్చావా సరేసరి, లేకపోతే నేను ఇక్కడి నుంచి కదలను." అన్నాడు.

ఇంతలో మిగిలిన శబరులు తిన్నణ్ణి వెతుక్కుంటూ వచ్చి, "తిన్నా, నువు తరిమిన అడవిపంది ఏమయింది?" అని అడిగారు. శివధ్యానంలో వున్న తిన్నడు మాట్లాడలేదు. వాళ్ళు అతన్ని ఇంటికి పోదాం పదమన్నారు.

"ఈ శివుడు నావెంట వస్తేగాని నేను ఇక్కడినుంచి కదలను. మీరు వెళ్ళండి," అన్నాడు తిన్నడు. అతను తిరిగి శివ ధ్యానంలో పడిపోవటం చూసి శబరులు వెళ్ళిపోయారు.






# రాజైన రైతు

పూర్వం ఫ్రిజియాదేశంలో గోర్డియస్ అనే రైతు యువకుడు ఉండేవాడు. అతను ఒకనాడు తన ఎడ్లబండి కట్టుకుని నగరానికి బయలుదేరాడు.

బండి కొంతదూరం వెళ్ళేసరికి ఎక్కడి నుంచో ఒక గరుడపక్షి వచ్చి, ఎద్దులకు మధ్యగా పోలు మీద కూచున్నది. ఇది శుభశకునమని గ్రీకుల నమ్మకం. తనకు కలగబోయే మంచి యోగం ఏమిటా అని గోర్డియస్ ఆశ్చర్యపోయాడు.

ఈ సమయంలో టెల్మిసస్ నగరంలో రాజు ఆకస్మికంగా మరణించాడు. రాజ్యం అరాచకమయింది. ఆ సమయంలో ఒక భక్తురాలికి గణం పూని, రచ్చపట్టులో కూడిన ప్రజలతో ఇలా చెప్పింది:

"మీరేమీ నిరాశపడకండి, మీ రాజు ఎడ్లబండి ఎక్కి ఇటే వస్తున్నాడు. బండిలో అతని సరసన మీ కాబోయే రాణి కూడా కూర్చుని వున్నది. బండి పోలు మీద ఒక గరుడపక్షి కూచుని ఉన్నది!"

ఈ వివరాలన్నీ తెలియగానే ప్రజలు సంతోషించి తమ కొత్త రాజు కోసం ఎదురు చూడసాగారు.

అయితే, భక్తురాలు చెప్పిన ఈ మాటలు విన్నవారిలో ఒక యువతి గబగబా నగరం వెలపలికి పరిగెత్తింది.

కొంతదూరం వెళ్ళాక ఆమెకు ఒక ఎడ్లబండి ఎదురయింది. దాని పోలు మీద గరుడపక్షి కూచుని ఉన్నది. బండిలో ఒక యువకుడున్నాడు—కాని అతని పక్కన ఎవరూ లేరు.

నగరం నుంచి వచ్చిన యువతి బండికి ఎదురు వెళ్ళి, గోర్డియస్‌తో, "ఆగు, ఆగు! నన్ను కూడా నీతోపాటు బండి ఎక్కనీ!" అన్నది.

ప్రాచీన గ్రీకు కథ

గోర్డియన్ బండి ఆపి ఆమెను ఎక్కించుకుని తన సరసన కూచోనిచ్చాడు.

"చూడు, నన్ను పెళ్ళాడతానని ప్రమాణం చేశావంటే నీకు ఈ సాయంకాలం లోగా మహా గొప్ప యోగం కలిగిస్తాను," అన్నది ఆ యువతి.

తన కేదో యోగం పట్టబోతున్నదని గోర్డియన్ గరుడపక్షిని చూసినప్పుడే అనుకున్నాడు. అందుచేత అతను ఆమె మాటలకు ఆశ్చర్యపడక, ఆమెను ఎగా దిగా చూసి, "నీ అందానికి తగిన వివేకం కూడా ఉంటే నిన్ను పెళ్ళాడటానికి నా కేమీ అభ్యంతరం లేదు!" అన్నాడు.

"నా వివేకం గురించి నీకేమీ సందేహం వద్దు," అంటూ ఆమె భక్తురాలు గణం పూని చెప్పిన మాటలు గోర్డియన్‌తో చెప్పి, "నేనీ బండిలో ఎక్కకపోతే నీవు రాజువు కాలేవు!" అన్నది.

గోర్డియన్ అవునన్నట్టు తల వూపాడు. ఇంకా ఝాము పొద్దుండగానే బండి నగరం ప్రవేశించింది. ఎడ్లబండీ, బండి పోలు మీద గరుడపక్షి, బండిలో పక్కపక్కనే కూచుని యువతీ యువకులూ కనిపించగానే ప్రజలు ఉత్సాహంతో "రాజు! రాజు!" అంటూ పెద్దగా జయజయ ధ్వానాలు చేశారు.

ఈ విధంగా గోర్డియన్ టెల్మిసస్ నగరానికి రాజు అయాడు. తనకీ అదృష్టం కలిగించిన బండి పోలుకూ కాడికీ కలిపి ఒక చిత్రమైన ముడి వేసి, ఆ రెంటినీ ఈశ్వరుడికి అంకితం చేసి దేవాలయంలో ఉంచి, "ఈ ముడి విప్పినవాడు ప్రపంచాని కంతకూ సార్వభౌము డవుతాడు," అని చెప్పాడు.

గోర్డియన్ వేసిన ఆ వింత ముడిని విప్పేందుకు చాలామంది ప్రయత్నించారు. కాని సాధ్యం కాలేదు.

ప్రపంచాన్ని జయించటానికి కంకణం కట్టుకున్న అలెగ్జాండరు కూడా ఆ ముడిని విప్పటానికి ప్రయత్నించి, విఫలుడై, విసిగి, చివరకు తన కత్తితో దాన్ని ఛేదించాడట.





# పిశాచాలజోస్యం

అంబాపురం అనే గ్రామంలో, సాంబుడనే యువకుడుండేవాడు. వాడు ఇంటి పెరట్లో కూరగాయలు పండించి, వాటిని పట్నంలో అమ్మి, కాలం గడుపుకు వస్తున్నాడు.

ఒకసారి వాడు కావిడిబుట్టల్లో తీసుకుపోయిన కూరగాయలు, అమ్ముడుపోయేసరికి సూర్యాస్తమానం కావచ్చింది. వాడు గ్రామానికి బయలుదేరాడు.

ఒక జాము రాత్రి గడిచాక, సాంబుడు దారిలో వున్న ఒక పెద్ద చింతతోపును చేరాడు. ఆ సమయంలో ఉరుములూ, మెరుపులతో వాన ప్రారంభమైంది. వాడు దారి పక్కనే వున్న ఒక చింతచెట్టు కిందికిపోయి నిలబడ్డాడు. ఒక గంటకాలం గడిచినా వాన తగ్గుముఖం పట్టలేదు.

ఇప్పుడు ఏంచేయడమా అని సాంబుడు దిక్కులు చూస్తూండగా, ఒకచోట కణకణమంటూ మండుతూన్న నెగడు కనిపించింది. ఇంత వానలో, ఆరని నెగడేమిటా అనుకుంటూ, వాడు దాన్ని సమీపించి, భయంతో కెవ్వుమని కేక పెట్టాడు. అందుక్కారణం, నెగడు చుట్టూ కూర్చుని వున్న మూడు పిశాచాలు!

సాంబుడి కేక విని, పిశాచాలు వాడికేసి చూసి, "ఇలా వచ్చి కూర్చో. నిన్నేం మింగేయంలే. అంబాపురం గ్రామం వాడివేగదా! రేపు మీ గ్రామంలో ఏం జరగనున్నదో, కాస్తచెప్పు?" అనిఅడిగాయి.

పిశాచాలు అలా అడగ్గానే, సాంబుడు ధైర్యం తెచ్చుకుని, వాటి దగ్గిరకుపోయి, "నేను కూరగాయలమ్మి పొట్టపోసుకునే వాణ్ణి. నాకు జ్యోతిషం తెలీదు," అన్నాడు.

"అలాగా! అయితే నేచెబుతాను, విను," అంటూ ఒక పిశాచం ముందుకు వంగి, నెగడులోని మంటను కొంత

మాచిరాజు కామేశ్వరరావు



ఊరి పెద్దచెరువుకు గండి పడుతుంది,'' అన్నది.

ఆ పిశాచాల జోస్యం విని, సాంబుడు ఆశ్చర్యపడుతున్నంతలో, అవి ఒకసారి పెద్దగా నవ్వి మాయమై పోయినై.

వాన తగ్గుముఖం పట్టగానే, సాంబుడు బయలుదేరి గ్రామం చేరాడు. వీధిలో పాఠశాలకు పోయే పిల్లలు కంటపడగానే, వాడికి పిశాచాల జోస్యం గుర్తుకువచ్చింది. వాడు పాఠశాలకుపోయి, ఉపాధ్యాయుడితో జరిగింది చెప్పి, "ఎందుకయినా మంచిది, పాఠశాలకు సెలవివ్వండి," అని సలహా ఇచ్చాడు.

మింగి, "మీ ఊరి పాఠశాల నానుకుని, ఒక వేపచెట్టు వున్నదిగదా! అది, పోయిన గాలివాన దెబ్బకు, ఒక పక్కకు బాగా వంగిపోయింది. రేపు ఉదయం వేళల్లో ఆ చెట్టు పాఠశాల మీద కూలి పడబో తున్నది," అన్నది కళ్ళు మూసుకుని.

రెండో పిశాచం నెగడులోంచి దోసిళ్లతో నిప్పులు తీసుకుని, తల మీద పోసుకుని, "సాయంత్రం జరగబోయే దేవుడి ఊరేగింపులో, ఆలయం ఏనుగుకు పిచ్చెక్కుతుంది," అన్నది, తల మీద వున్న నిప్పులను నెగడులోకి రాల్చుతూ.

మూడో పిశాచం తన నోట్లోంచి నెగడులోకి మంటను ఊదుతూ, "రాత్రికి, మీ

ఆ ఉపాధ్యాయుడికి వేరే సొంత పని వుండడంతో, పాఠశాలకు సెలవని చెప్పి, అప్పటికే వచ్చిన పిల్లలతో ఆవరణ దాటుతూండగా, వేపచెట్టు ఫెళఫెళమంటూ దానిమీద కూలిపడింది.

క్షణాలమీద పిశాచాల జోస్యం సంగతి, గ్రామంలో అందరికీ తెలిసిపోయింది. గ్రామ పెద్దలు కొందరు సాంబుడి దగ్గరకు వచ్చి, పిశాచాలు మరేమైనా చెప్పాయా అని అడిగారు.

"సాయంత్రం ఆలయపు ఏనుగుకు పిచ్చి పట్టబోతున్నదట! రాత్రికి మన ఊరి పెద్దచెరువుకు గండీపడబోతున్నదట!" అని చెప్పాడు సాంబుడు.

ఆలయ ధర్మకర్తలు ముందు జాగ్రతగా, ఏనుగును తీసుకుపోయి, గ్రామం బయట ఒక చెట్టుకు గొలుసులతో కట్టివేశారు. అయితే, దేవుడి ఊరేగింపు ప్రారంభం కాగానే, అది పెద్ద ఘీంకారాలు చేస్తూ, గొలుసులు తెంచుకుని, అడవిలోకి పారిపోయింది.

ప్రమాదం తప్పినందుకు గ్రామస్థులు సాంబుణ్ణి మెచ్చుకుని, ఆ రాత్రి కొందరు కాగడాలతో చెరువుగట్టుమీద కాపలా వేశారు. అర్ధరాత్రి సమయంలో, వాన నీరు కాలవలగుండా వచ్చి చెరువులో పడడంతో, దానికి గండి పడింది. వెంటనే జనం, ఆ గండీని రాళ్ళతోనూ, మట్టి తోనూ పూడ్చివేశారు.

''పిశాచాల జోస్యం అక్షరాలా నిజ మయింది, సాంబుడూ! ఈ రాత్రి చింత తోపుకుపోయి, అవేం చెబుతాయో తెలుసుకురా,'' అని గ్రామ పెద్దలు సాంబుణ్ణి కోరారు.

సాంబుడు చీకటి పడగానే పిశాచాల దగ్గిరకు వెళ్ళాడు. అవి, వాణ్ణి అంత దూరంలో చూస్తూనే, ''అంబాపురవాసీ, రారా! మా జోస్యం ఫలించినట్టేనా?'' అని అడిగినై.

''ఓం, మహా బాగా ఫలించింది. పిశాచాల జోస్యానికి తిరుగుంటుందా!



ఈ రాత్రి ఏం చెబుతారో తెలుసుకుందా మని వచ్చాను,'' అన్నాడు సాంబుడు.

పిశాచాలు వాడితో—మర్నాటి రాత్రి జమీందారింట్లో దొంగలు పడబోతున్నా రనీ, గ్రామ పెద్ద ధనంజయ్య కూతురు పెళ్ళికి వండే సారకాయపులుసులో, బల్లి పడబోతున్నదనీ, చెప్పి మాయమయినై.

సాంబుడు గ్రామానికి తిరిగివచ్చి, ఈ సంగతి జమీందారుకూ, ధనం జయ్యకూ తెలియపరిచాడు. వాళ్ళు ముందే జాగ్రతపడడంతో ప్రమాదాలు తప్పాయి.

మర్నాడు జమీందారు స్వయంగా బగ్గీలో సాంబుడి పాకకువచ్చి, ''ఈరాత్రి



పిశాచాలను, నాకు కొడుకు ఎప్పుడు పుడతాడో కనుక్కో. నీ కష్టం వుంచుకోనులే!" అంటూ వంద బంగారు కాసులున్న మూటను సాంబుడికిచ్చి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత కొద్ది సేపటికి గ్రామ శ్రేష్ఠి, వాడి దగ్గిరకు వచ్చి, "మా పూర్వులూ, నా భార్యా తరఫువాళ్ళూ, ఏడెనిమిది తరాలకిందట, ఓడ వ్యాపారం చేసి లక్షలూ, కోట్లూ ఆర్జించారు. ఈ చిల్లర కొట్టేమిటి? ఓడలమీద సముద్రవ్యాపారం ప్రారంభించమని, నా భార్య ఒకటే పోరు పెడుతున్నది. అందులో నాకు అచ్చి వస్తుందో, రాదో, కాస్త ఆ పిశాచాలనడిగి తెలుసుకో," అని సాంబుడి చేతిలో ఒక బంగారు కాసూ, ఒక వెండికాసూ పెట్టి వెళ్ళాడు.

ఈ విధంగా సాయంకాలం అయే టప్పటికి, వాళ్ళూ, వీళ్ళూ పిశాచాల జోస్యం కోసం ఇచ్చిపోయిన డబ్బు లెక్కచూసుకునేసరికి, సాంబుడికళ్ళు చెదిరిపోయాయి. అంతా కలిపి వెయ్యి కాసులవరకూ జమపడింది.

సాంబుడు అందరికోరికలూ, ఒక కాయితంమీద రాయించుకుని, వచ్చిన డబ్బులో ఐదువందల కాసులు మూట కట్టుకుని, ఆ రాత్రి మళ్ళీ పిశాచాల దగ్గిరకు పోయాడు.

పిశాచాలు వాణ్ణి చూస్తూనే, "అంబా పుర వాసీ, రారా!" అన్నవి నవ్వుతూ.

సాంబుడు చనువుగా పోయి, వాటి పక్కన కూర్చుని, "మీరు ఎప్పుడూ జరగబోయే చెడును గురించే చెబుతున్నారు. అలా కాక, జరగబోయే మంచిని గురించి కూడా చెబితే, కనక వర్షం కురుస్తుంది!" అంటూ కాసులమూటను పిశాచాలకు చూపించాడు.

తరవాత వాడు జరిగినదంతా పిశాచాలకు చెప్పి, గ్రామ ప్రజల కోరికలు రాసి వున్న కాయితం వాటిముందు పెట్టి, "అన్నింటికీ జవాబులు చెప్పి. ఐదు

వందల కాసులు పుచ్చుకోండి. నా వాటా ఐదు వందలు. ఒక్క రోజులో ఇంత సంపాదన! ఇక నేను కూరగాయలు పండించే గొడ్డు చాకిరీ మాని, ఇలా హాయిగా డబ్బు సంపాయించదలిచాను," అన్నాడు.

వాడి మాటలు వింటూనే పిశాచాల కళ్ళు నిప్పు కణికల్లా అయాయి. అవి వాడు తెచ్చిన కాయితాన్నీ, కాసుల మూటనూ నెగడులో వేసి, "ఒరే, మూర్ఖుడా! ఇంకేనాడూ ఇటు రాకు. ఒక వేళ వచ్చినా, మేం నీకు కనిపించం," అంటూ మాయమయి పోయినై.

ఈ జరిగినదానికి సాంబుడు విస్తుపోయి, ఒక పుల్లతో నెగడునంతా కదిపి చూశాడు. ఎక్కడా వాడికి కాసులు కనిపించలేదు. తెల్లవారితే ఎవరి డబ్బు, వారికి తిరిగి ఇవ్వాలి. ఏం చేయాలో తోచక వాడికి దుఃఖం ముంచుకువచ్చింది.

తెల్లవారాక, ఆ దారిన పోతున్న ఒక ముసలి బాటసారి సాంబుణ్ణి చూసి, "ఏం, నాయనా! అలా విచారంగా కూర్చున్నావు?" అని అడిగాడు.

సాంబుడు అతడికి జరిగినదంతా చెప్పాడు.

అంతా విన్న బాటసారి, "నాయనా, ఆ పిశాచాలన్నట్టు, నిజంగానే నువ్వు మూర్ఖుడివి! పిశాచాలు డబ్బు ఏం చేసుకుంటాయి? అవి చేసిన చెడ్డ పనులకు ప్రాయశ్చిత్తంగా, కొన్ని మంచి పనులు చేయాలనుకున్నవి. అందువల్లనే, మీ గ్రామానికి రానున్న ప్రమాదాల గురించి ముందుగా హెచ్చరించినై. వాటి సదుద్దేశాన్ని నువ్వు, వ్యాపారంగా మార్చచూశావు. ఆ కారణంగా అవి నీకు యిక కనబడమంటూ మాయమయినై," అని చెప్పాడు.

ఆ మాటలతో సాంబుడికి తన తప్పేమిటో అర్థమైంది. నాలుగైదు నెలల్లపాటు, మరింతగా కష్టించి పని చేసి, గ్రామస్థులిచ్చిన డబ్బు బాకీ తీర్చవచ్చునన్న ఆత్మవిశ్వాసంతో, వాడు ఇంటిదారి పట్టాడు.





# సేనాని ఎన్నిక

గజపుర సేనానాయకుడు వీరమల్లు హఠాత్తుగా మరణించడంతో, రాజు ఇంద్రసేనుడికి వెంటనే మరొకరిని ఆ పదవిలో నియమించవలసిన అవసరం కలిగింది. అందుకు తగినవాళ్ళు సైన్యంలో ముగ్గురున్నారు—విక్రముడు, అజయుడు, శూరసేనుడు. ఆ ముగ్గురిలో ఎవరికి సేనానాయకపదవి ఇవ్వడమా అని ఆయన తీవ్రంగా ఆలోచిస్తున్నంతలో, ఇందుపుర సర్వసేనాని, రాజును చూడ వచ్చాడు.

గజపుర, ఇందుపురాలు అనాదిగా మిత్రరాజ్యాలు. వీటికి పొరుగునవున్న మరొక దేశపు రాజు యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నాడని తెలిసి, ఆ సంగతి తెలియజేయడానికి ఇందుపుర రాజు తన సేనాని అయిన అమరుణ్ణి, ఇంద్రసేనుడి వద్దకు పంపాడు.

అమరుడు పొరుగురాజు రహస్యంగా సాగిస్తున్న యుద్ధ ప్రయత్నాల గురించి ఇంద్రసేనుడికి వివరంగా చెప్పి, ''ఇది అత్యంత సమర్థులైన, మా చారులు అందజేసిన సమాచారం. మనం తగు జాగ్రత్తలో వుండడం ఎంతో అవసరం అని మహారాజుగారు అభిప్రాయపడుతున్నారు. ఇలాంటి క్లిష్ట సమయంలో మంచి నిపుణుడైన తమ సేనాని వీరమల్లు మరణించడం దురదృష్టకరం,'' అన్నాడు.

''ఆ మాట నిజం. మరొక సమర్థుడైన వాణ్ణి అతడి స్థానంలో వెంటనే నియమించాలనుకుంటున్నాను,'' అని ఇంద్రసేనుడు తన కెదురైన సమస్య గురించి చెప్పి, ''మీరే ఏదైనా పరీక్ష లాంటిది పెట్టి, శూరసేనుడు, అజయుడు, విక్రముడు—ఆ ముగ్గురిలో ఒకరిని ఎన్నిక చేయడం

రాంబాబు

బావుంటుంది గదా. ఏమంటారు?'' అని అడిగాడు.

అమరుడు అందుకు ఒప్పుకుని, మర్నాడు ఆ ముగ్గురినీ విడివిడిగా పరీక్షించి చూస్తానన్నాడు.

మర్నాడు రాజు ఇంద్రసేనుడూ, అమరుడూ ఒక గదిలో ఆశీనులయ్యారు. ముందుగా శూరసేనుడికి కబురు వెళ్లింది. అతడు రాగానే అమరుడు, ''మన పొరుగు రాజులు కొందరు మనపై కత్తి దూయాలన్న ప్రయత్నంలో వున్నట్టు తెలిసింది. వాళ్ళ సైనికబలం ఏపాటిదో నీకు తెలుసా?'' అని అడిగాడు.

శూరసేనుడు వెంటనే ఆయా రాజుల గజాశ్వబలాల సంఖ్య, సైనికులు వాడే వివిధ రకాల ఆయుధాల వివరణా చెప్పేశాడు.

అంతా విన్న అమరుడు, శూరసేనుణ్ణి, ''మంచిది! మరి, మీ గజపుర సైనిక బలం సంగతేమిటి?'' అని అడిగాడు.

శూరసేనుడు తడువుకోకుండా తమ రాజ్య సైనికబలాల వివరాలన్నీ చెప్పడమే కాక, ఎంత సైనికబలం ఏ రాజ్య సరిహద్దులో వున్నదో కూడా వివరంగా తెలియబరిచాడు.

అమరుడు అతణ్ణి వెళ్ళమని, అజయుణ్ణి పిలిపించి, శూరసేనుణ్ణి ప్రశ్నించినట్టే ప్రశ్నించాడు.

అజయుడు కూడా శూరసేనుడి లాగే అడిగిన మరు క్షణమే పొరుగురాజ్యాల



సైనికబలం గురించే కాక, తమ రాజ్య సైనికబలాల గురించీ కూడా వివరంగా చెప్పేశాడు.

అతడు వెళ్ళిన తరవాత విక్రముడు వచ్చాడు. అమరుడు అతణ్ణి మిగతా ఇద్దర్నీ ప్రశ్నించినట్టే ప్రశ్నించాడు.

అయితే, విక్రముడు మాత్రం పొరుగు రాజ్యాల సైనికబలాలను గురించి సరైన వివరాలు చెప్పి, తమ రాజ్య సైనికబలం గురించి తనకు అంతగా ఏమీ తెలియదన్నాడు.

విక్రముణ్ణి పంపివేశాక అమరుడు, రాజు ఇంద్రసేనుడితో, "మహారాజా, మీ సైన్యాధిపతిగా వుండదగినవాడు, ఈ విక్రముడే!" అన్నాడు.

దానికి రాజు ఆశ్చర్యపోయి, "తన రాజ్యపు సైనికబలం సంగతి తెలియని వాడికా, సేనానిపదవి కట్టబెట్టడం!" అన్నాడు.

"మహారాజా, విక్రముడికి తమ సైనిక బలంగురించి క్షుణ్ణంగా తెలుసు. అయితే, ఆ సంగతి నా దగ్గిర ఎందుకు దాచాడో, తమరు ప్రశ్నించి చూడండి," అన్నాడు అమరుడు.

అమరుడు తిరిగి తన రాజ్యానికి వెళ్ళిపోయాక, రాజు ఇంద్రసేనుడు, విక్రముడికి కబురుచేసి, "మన రాజ్య సైనిక బలాల వివరం నీకేమీ తెలియదా?" అని అడిగాడు.

అందుకు విక్రముడు ఎంతో వినయంగా, "మహారాజా, మన దేశం, ఇందుపురం ప్రస్తుతం ఎంత మిత్రదేశాలైనప్పటికీ, భవిష్యత్తులో ఎలాంటి మార్పులు రాగలవో మనం చెప్పలేం గదా! అందువల్ల, మన సైనికబలాల విషయం, ఒక పొరుగుదేశపు సైనికాధికారికి తెలియచెప్పడం భావ్యం కాదని, నా అభిప్రాయం," అన్నాడు.

ఆ జవాబుకు రాజు చాలా సంతోషించి, అనాడే విక్రముణ్ణి సేనానాయకుడుగా నియమిస్తూ అధికార ప్రకటన జారీ చేశాడు.





# తెలివిగలది

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆ రైతుకు ఒక్కడే కొడుకు. అందుచేత రైతు తన కొడుకును చాలా గారాబంగా పెంచి, వాడు పెద్దవాడై ఎంతో సమర్థుడవుతాడని ఆశించాడు. రైతు కొడుకు కూడా ఆ రోజుకారోజు తాను చాలా తెలివిగలవాణ్ణి అవుతున్నానని గర్వపడుతూ వచ్చాడు. వాడికి తన తెలివితేటలలో నమ్మకం హెచ్చినకొద్దీ, తండ్రికి తగ్గసాగింది. ఇలా కొంతకాలం జరిగాక ఒకనాడు రైతు కొడుకుతో, ''నీకు ఇరవైయేళ్ళు నిండాయికదా, కాస్తయినా చేతికి అక్కరకు రాకుండా ఉన్నావే! ఆలోచించినకొద్దీ నీకు తెలివితేటలు శూన్యంగా ఉన్నట్టు కనబడుతున్నది!'' అన్నాడు.

''తెలివితేటలు నాకు లేకపోతే ఇంకెవరికున్నాయి? నన్ను ఏం చెయ్యమంటావో చెప్పు!'' అన్నాడు కొడుకు.

''మన ఇంట్లో గొర్రెచర్మం ఉన్నది. దాన్ని రేపు సంతలో అమ్మి రా, నీ తెలివితేటలు చూస్తాం!'' అన్నాడు రైతు.

''క్షణంలో చర్మం అమ్మేసి డబ్బు తీసుకురానూ?'' అన్నాడు కొడుకు.

''ఓరి పిచ్చివాడా! చర్మం అమ్మి డబ్బులు తీసుకురావటంలో తెలివి ఏమున్నది? ఆ పని ఎవడైనా చేస్తాడు. నిజంగా తెలివిగలవాడివైతే చర్మమూ, దాని ఖరీదూ కూడా తీసుకురావాలి.. తెలిసిందా?'' అన్నాడు తండ్రి.

కొడుకు కొంచెం కూడా ముందూ వెనకా ఆలోచించకుండా, ''ఓ; అలాగే చేస్తాను. రేపు సాయంకాలం లోపల గొర్రెచర్మమూ, దాని ఖరీదూ కూడా తెస్తాను, చూసుకో!'' అని ప్రగల్భాలు పలికాడు.

మర్నాడు ఉదయం పెందలాడే వాడు గొర్రెచర్మం చుట్టి చంకన పెట్టుకుని



సంతకు బయలుదేరాడు. వాడు సంతలో అడుగు పెట్టుతూండగానే ఎవరో ఎదురై, "గొర్రెతోలు అమ్మకానికా? ఎంత కిస్తావు?" అని అడిగాడు.

"ఎంత కిచ్చినా నాకు తోలూ, దాని ధరా కూడా కావాలి!" అన్నాడు రైతు కొడుకు.

తోలు కొందామనుకున్నవాడు గట్టిగా నవ్వి, "భలే ఆలోచనే! ఇటువంటి గొప్ప ఆలోచన ఇంతవరకు ఎవరికీ తట్టలేదు. అయినా నలుగురినీ అడిగి చూడు, ఎవరైనా చర్మం తీసుకోకుండా దాని ఖరీదు నీకిచ్చేస్తారేమో!" అంటూ తన దారిన తాను వెళ్ళాడు.

సంతలో ఎంతోమంది రైతు కొడుకును చర్మం ఖరీదు అడిగారు. అందరికీ వాడు అదే సమాధానం చెప్పాడు. అందరూ వాణ్ణి చూసి నవ్వి చర్మం కొనకుండా తమ దారిన వెళ్ళిపోయారు.

మిట్టమధ్యాన్నం దాటిపోయింది. పొద్దు వాలిపోతున్నది. రైతు కొడుకు తెచ్చిన చర్మం ఇంకా వాడి చంకలోనే ఉన్నది. సంత అంతటా తిరిగి తిరిగి, వాడి కాళ్ళు పడిపోతున్నాయి. వాడు ఒక గుంపు గుమికూడి ఉన్న చోటికి వచ్చాడు.

ఈ గుంపు నడిమధ్య ఒక విప్రవినోది ఇంద్రజాలం చేస్తున్నాడు. వాడు రైతు కొడుకును చూడగానే, "అబ్బాయీ, ఆ తోలు ఒకసారి ఇయ్యి. మంచి వినోదం చూపిస్తాను!" అన్నాడు.

రైతు కొడుకు తన చంకలో ఉన్న చర్మాన్ని విప్రవినోదికి ఇచ్చేశాడు. వాడు ఆ తోలు చుట్టను భూమి మీద నిలబెట్టి దానిపైన తన పైబట్ట కప్పి, అందరినీ చప్పట్లు కొట్టమన్నాడు. అందరూ చప్పట్లు కొట్టినాక వాడు తన పైబట్టను తీసేశాడు. దానికింద ఒక మామిడిమొక్క ఉన్నది. దానికి ఒక మామిడికాయ కూడా ఉన్నది.

రైతు కొడుకు మొదట ఆశ్చర్యపడ్డాడు. మళ్ళీ తన చర్మాన్ని తనకిచ్చెయ్యమని విప్రవినోదిని అడుగుదా

మనుకుంటే వాడు కాస్తా అదృశ్య మయాడు.

రైతు కొడుకు కళ్ళనీళ్ళ పర్యంత మయాడు. వాడు చర్మాన్నీ, దాని ఖరీదునూ కూడా తెచ్చి ఇస్తానని తండ్రికి మాట ఇచ్చి ఉన్నాడు. చర్మం ఖరీదు రాకపోగా, చర్మం కూడా పోయింది. వట్టి చేతులతో ఇంటికిపోతే తనకు బుద్ధి లేదని రుజువవుతుంది.

ఈ మనోవేదనకు తోడు వాడికి అకలి కూడా వేస్తున్నది. ఎదురుగా ఉన్న మామిడిమొక్కకు కాయ కనిపిస్తున్నది. దాన్ని తిని అయినా ఆకలి బాధ కొంత నివారించుకుందామనుకుని వాడు ఆ కాయను పట్టుకున్నాడు. వెంటనే మామిడి మొక్క మాయమై గొర్రెచర్మం కనిపించింది.

అంతే చాలు ననుకుని, సంతోషంతో వాడు ఆ గొర్రెచర్మం చుట్టి చంకన పెట్టుకుని ఇంటిదారిపట్టాడు. సూర్యాస్తమయం కాబోతున్నది. దారి నిర్మానుష్యంగా ఉన్నది. కొంతదూరం వెళ్ళేసరికి వెనక నుంచి ఎవరో పిలిచినట్టు వినపడింది. రైతుకొడుకు తిరిగి చూస్తే విప్రవినోది కనిపించాడు.

విప్రవినోది రైతు కొడుకును కలుసుకుని వాడి వెంట నడుస్తూ, "నువు చాలా



బుద్ధిమంతుడివి. నీ కొక్క సలహా చెబుతాను, దాన్ని మరిచిపోకు!" అన్నాడు.

"ఏమిటది?" అన్నాడు రైతుకొడుకు.

"దారిలో ఆడవాళ్ళు కనబడితే వాళ్లను ఆప్యాయంగా కుశల ప్రశ్నలు చెయ్యి." అన్నాడు విప్రవినోది.

కొంతదూరం నడిచాక దారి చీలింది. విప్రవినోది రెండో దారిన వెళ్ళిపోయాడు. రైతు కొడుకు తన గ్రామం వేపు నడుస్తూ చీకటి పడేసరికి ఒక వాగు వద్దకు వచ్చాడు. ఆ వాగుకు అంతదూరంలో ఒక ఇల్లున్నది. ఆ ఇంట్లో నుంచి ఒక పదహారేళ్ళ పిల్ల బిందెతో వచ్చి వాగులో నీళ్ళు తీసుకుంటున్నది. విప్రవినోది

ఇచ్చిన సలహా జ్ఞాపకం పెట్టుకుని రైతు కొడుకు, "అమ్మాయీ, అంతా కులాసా?" అని అడిగాడు.

"మీరంతా కులాసాయేనా ?" అని ఆ అమ్మాయి కూడా అడిగింది.

ఇద్దరూ మాట్లాడుకోవటంలో, ఆ పిల్ల రైతుకొడుకు పొద్దుటి నుంచీ భోజనం చెయ్యలేదని తెలుసుకున్నది. ఆమె అతన్ని తన ఇంటికి తీసుకుపోయి జొన్న రొట్టెలు పెట్టింది. తరవాత అతన్ని గొర్రె తోలు గురించి అడిగింది.

"మా అయ్య దీన్ని అమ్మి దీని ఖరీదూ, చర్మమూ కూడా తీసుకురమ్మన్నాడు. నాకు సాధ్యం కాలేదు !" అన్నాడు రైతు కొడుకు.

"ఇంతేగద! నేను నీకు చర్మమూ, చర్మం యొక్క ఖరీదూ ఇస్తానుండు !" అంటూ ఆ పిల్లవాడి వద్ద గొర్రెతోలు తీసుకుని దాని మీద ఉన్న బొచ్చంతా కత్తిరించి, తోలూ, బొచ్చు ఖరీదూ కూడా రైతు కొడుక్కు ఇచ్చేసింది.

రైతు కొడుకు పరమానందం చెంది ఆ అమ్మాయితో వస్తానని చెప్పి ఇంటికి వచ్చేశాడు. తన కొడుకు తెచ్చిన చర్మమూ, డబ్బులూ చూసి రైతు సంతోషించి, "నీకీ ఉపాయం చెప్పిన మనిషి ఎవడురా ?" అని అడిగాడు.

"మగమనిషి కాదు, ఆడమనిషి !" అంటూ వాడు జరిగినదంతా తండ్రికి చెప్పాడు.

"ఇదేనా నీ తెలివి? అటువంటి అమ్మాయి తటస్థపడితే వెంట తెచ్చుకుని పెళ్ళి చేసుకోరా ? నీకు తెలివితేటలు లేవని నేను మొదటి నుంచీ అనుకుంటూనే ఉన్నాను !" అన్నాడు రైతు.

రైతు కొడుకు అప్పటికప్పుడే బయలుదేరి వాగు ఉన్నచోటికి వెళ్ళి, ఆ అమ్మాయితో, "నన్ను పెళ్ళాడతావా ?" అని అడిగాడు. ఆ అమ్మాయి నవ్వి, వాణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకుని రైతు ఇంటికి వచ్చేసింది. రైతు వాళ్ళిద్దరికీ గొప్పగా పెళ్ళి చేసేశాడు.



## పక్షులు-జంతువులు :

అమెరికా నావికా పరిశోధన సంస్థ 1976 వ సంవత్సరంలో ఒక వింత సొర (షార్క్) చేపను కనుగొన్నది. ఈ చేప నోట్లో ఏడు వరుసలలో సూదుల్లాంటి పళ్ళు ఉన్నాయి. 4.42 మీటర్ల పొడవూ, 748 కి॥గ్రా॥ బరువూ గలిగిన ఈ చేపను మెగామౌత్‌షార్క్ (పెద్ద నోరు గల సొరచేప) అని పిలువసాగారు.



మెగామౌత్‌షార్క్



### గుడ్లగూబ చెవులు

కొన్ని రకాల గుడ్లగూబలకు తల మీద చెవుల్లాగా కనిపించేవి చెవులు కావు. అవి కేవలం ఈకలు మాత్రమే. అసలైన చెవులు తలకు ఇరువైపులా పక్కల్లో, ఈకల లోపల బయటకు కనిపించ కుండా ఉంటాయి!

ప్రపంచంలో అతి చిన్నదయిన గబ్బిలం థాయ్‌లాండ్‌లో ఉన్నది. 160 మిల్లి మీటర్ల పొడవైన రెక్కలతో 3.2 మిల్లి మీటర్ల శరీరం కలిగి ఉన్నదీ బుల్లి గబ్బిలం.



బుల్లిగబ్బిలం

కొత్తది!




# ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజుగా చేసుకోండి

## కొండలోయల పుష్పాల పరిమళంతో

సూపర్ ఫ్రెష్ సహజమైన హాయనిపించే సుఖానుభూతిని
చేకూర్చే సుగంధ భరిత క్రొంగొత్త సబ్బు, మీచర్మానికి మృదుత్వాన్ని
చేకూర్చి మీకు ఉల్లాసాన్ని కొనితెస్తుంది.
అందుకే కొద్దిగా తాజాదనాన్ని జల్లుకోండి,
ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజుగా తీర్చుకోండి.

5949/TL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 అగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



A. V. Rangaiah



A. V. Rangaiah

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పూల తోటకా పాపా!    రెండవ ఫోటో: బ్రతుకు వేటకా తాతా!!

పంపినవారు: రాయప్రోలు సత్యప్రసాద్, సునాబేడా, కోరాపుట్, ఒరిస్సా.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. సిరియారాజధాని డమాస్కస్ 2. సెయింట్ పీటర్స్‌బర్గ్ 3. క్రిస్టియానియా 4. మెల్‌బోర్న్ 5. అల్-ఖహి రాహ్

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Hey kids!
# A special biscuit is coming your way...

# Ampro Candy Bisk

It's new! It's different! It tastes like sugar candy!

**Quiz No.1** (Cut and keep)

**Do you know:**

1. How high is Eiffel Tower?
2. Which country gifted Statue of Liberty to America?
3. The sphinx has a human head and an animal's body. Which animal's?
4. Who built the Charminar?
5. How much does the Leaning Tower of Pisa lean?

Answers:

1. 984 ft (300 mts) 2. France
3. Lion 4. Mohammed Quli Kutub Shah
5. 17 ft (5.2 mts) from the perpendicular

**Identify these landmarks:**



1. Eiffel Tower 2. Statue of Liberty 3. Sphinx 4. Charminar 5. Leaning Tower of Pisa




ampro® Candy Bisks

**Delightfully different... deliciously familiar!**

Sista's/AIL/459/86 B

# "అమ్మా, ఇంకో రస్న ప్యాకెట్ తెరవ్వా!"

నారింజ రుచి! బలే మజా!






## రస్న

భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ కాన్సంట్రేట్

Mudra:A:PI:2951 TEL